## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010007149

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# రత్నత్రయము

[రామతీర్థ - రామను - పండితరాయల చరిత్రములు]

★

గ్రంథకర్త:

విద్వాన్

శ్రీ బులుసు వేంకటేశ్వరులు, ఎం.ఏ.

పి. ఆర్. (Govt.) కాలేజి, కాకినాడ.

గ్రంథకర్త: శ్రీ మహర్షి జీవితకథామృతము,
అష్టావక్రచరిత్ర, కుందమాల, అభిషేకము,
వేణీసంహారము, అహల్యాగౌతమము,
అరుంధతీ వసిష్ఠము, యజ్ఞఫలము,
మహాపురుషులు, ఇత్యాది.

★

ప్రకాశకులు:

జమ్మలమడక గోపాలము, బి.ఏ., యల్.టి.,

రామారావుపేట, కాకినాడ.



1956

వెల రూపాయి.

# రత్నత్రయము

విషయసూచిక :



# నివేదనము

నేఁటి విద్యార్థిలోకమున విరివిగాఁ బ్రచారము నందవలసిన సుగుణములలో ముఖ్యములు: దేశభక్తి, విజ్ఞానరక్తి, సమరసశక్తి. ఈమూఁడింటితో దైవభక్తి మిళితమై మన బాలుర కలవడిననాఁడే మన విద్యార్థులు భారతీయ విద్యార్థులనఁ దగుదురు. అందుచే నీ యాదర్శములతో నాధునికు లనఁదగిన శ్రీ రామతీర్థస్వామి, రామనుపండితుఁడు, పండితరాయలు - వీర జీవితచరిత్రము లిట సంక్షేపముగా నిచ్చితిని. మొదటి వ్యక్తి తాత్త్విక దేశభక్తులలో నగ్రేసరుఁడు, రెండవ వ్యక్తి వైజ్ఞానికులలోఁ బ్రధానుఁడు.' మూఁడవ వ్యక్తి విద్వత్కవిశేఖరుఁ డయిన యాంధ్రుఁడు; ముప్వురు మూఁడు రకముల రత్నములు. ఈ 'రత్నత్రయము' విద్యార్థుల కరకమలము లలంకరించి వారివారి జీవితపథముల నున్నత కాంతిపుంజములను జిమ్మునటుల విద్యాశాఖాధికారు లొనరించినందులకు వారియెడఁ గృతజ్ఞుఁడను.

— గ్రంథకర్త.

# గురుస్తుతి

శ్రీ గురుదేవపవిత్ర
శ్రీ గురుచరణారవింద సేవ యొసంగున్
వాగర్థంబులు విద్యా
శ్రీ గురుతయుఁ గానఁ గొలుతు శ్రీ గురుపదముల్.

# రత్నత్రయము

## ౧

## జ్ఞానిరత్నము : రామతీర్థుఁడు

భారతమహాపురుషులలో శ్రీరామతీర్థస్వామి యొకఁడు. ఈతఁడు మన దేశీయవిజ్ఞానముతో పాటు పరదేశీయవిజ్ఞానమును సైతము యుక్తియుక్తముగా నర్థము చేసికొని భారతీయవిజ్ఞానమే యన్ని దేశములలోని విజ్ఞానముకన్న నెన్నోరెట్లు గొప్పదని మన దేశముననే కాక యితర దేశములందును విస్పష్టముగాఁ జాటిన మహామేధావి. జ్ఞానసంపద నార్జించుటకే తన సర్వస్వమును ధారపోసి జ్ఞానసిద్ధి నీతఁ డందఁగలిగెను. కాని, యీతఁడు జ్ఞానముతో పాటు ప్రథమశ్రేణికిఁ జెందిన దేశభక్తి నుగ్గుఁబాలతోఁ బుణికిపుచ్చుకొన్న మహనీయుఁడు. రామతీర్థునివంటి తాత్త్విక దేశభక్తులు మన దేశమందే కాదు – ఏ దేశమందైనను జాల నరుదుగనే యుందురనుటకు సందేహము లేదు. ఈతఁడు జీవించినది ముప్పదిరెండు సంవత్సరములే యైనను భారతజాతి కీతఁడు చేసిన సేవ నిరుపమానము. అది కొన్ని యుగములవఱకు నిలిచి యుండఁగలదు. దేశభక్తి యన నేమి ? మానవుఁడు తనకుఁదాను దరించి దేశమును దరింపఁ

జేయు టెట్లు? మానవజాతి నుద్ధరించుపద్ధతి యేది? అన్న ప్రశ్నముల కీతనిజీవితమే తగిన సమాధాన మీయఁగలదు.

## జ న న ము

మన దేశమునఁ గల ప్రధానరాష్ట్రములలో నొకటి పంజాబురాష్ట్రము. ప్రసిద్ధమగు నదీపంచకము ప్రవహించు దేశమగుటచే దీనికిఁ బంచనదము–పంజాబు–అని పేరువచ్చెనందురు. ఈప్రాంత దేశమున వసిష్ఠమహర్షి సంతతిలో జనించినవారు కొందఱు గలరు. వారిలో వాడవాడలఁ బేరుమ్రోసిన రామాయణమును హిందీభాషలో మృదుమధురముగా రచించి మహాఖ్యాతిఁగాంచిన తులసీదా సొకఁడు. ఈతని వంశపరంపరలోని వాఁడేయగు హీరానందుఁడను నొక పేదబాపఁడు గుజరన్వాలా జిల్లాకుఁ జెందిన మురళీవాలాయను నూర నివసించుచుండెను. ఆతనియిల్లు దరిద్రదేవతకు స్థానమై యుండెను. కాని, వంశపారంపర్యముగావచ్చుచున్న రామభక్తి, సదాచారము, సుగుణసంపద–వీనికిసైత మాతని యిల్లాలవాలముగనే యుండెను. ఆతఁడు దరిద్రదేవత తలపైఁ దాండవమాడుచున్నను, దైన్యపడక ప్రజలు తన్నభిమానించి యిచ్చుచుండెడి ధనధాన్యములతో నెట్లో తనయాలితోఁగూడ దినములు కడుపుచుండెను.

ఇట్లు కొంతకాలము కడచినంతనే హీరానందుని భార్య గర్భము ధరించి నెలలు నిండినపిమ్మట నొక సుపుత్త్రుని గాంచి కొన్ని దినములలోనే మరణించెను. ఆ పుట్టినబిడ్డఁడే రామతీర్థుఁడు. ఆతఁడు పుట్టినదినమే బుధవారము. అక్టోబరు నెల.

ఆరువది రెండవ తేది. క్రీస్తుశకము పదునెనిమిదివందల డెబ్బది మూఁడవ సంవత్సరము.

## బాల్యము

కష్టసుఖములు కావడికుండలు. ఈ కష్టసుఖముల రాక పోకలు ప్రకృతిసిద్ధములు. ఇవి వలయునన్న వచ్చునవి వల దన్నఁ బోవునవి కావు. అట్లని వచ్చి యట్టిపెట్టుకొని యూరేఁగునవి కావు. రాక మానవు. వచ్చి పోక మానవు. వీని రాక పోకలతో సంబంధములేకయే ప్రాణికోటికిఁ జావుపుట్టుకలు చరచర జరగుచునే యుండును. ఇది సృష్టిరహస్యము.

పుట్టినబిడ్డను దల్లి లేని లోపము రానీయక హీరానందుని సోదరి యొకతె పెంచుచువచ్చెను. హీరానందుఁడును దన కుమారుని నగుమోముఁ గనుచు సతీవియోగమును సహించెను. రామతీర్థుఁడు క్రమముగాఁ బెరుఁగుచు నైదవయేఁట నక్షరాభ్యాసమైన వెనుక నా యూరిలోనే గలయొక వీధిపాఠశాలకుఁ బోఁదొడఁగెను. అతని బాల్యమునుండియు నాతని మేనత్త తనతోనే దేవాలయమునజరుగు పురాణకాలక్షేపమునకో యూతనిని సైతముదీసికొని పోవుచుండెడిది. ఆకారణమున బాల్యము నుండి యాతనికి రామభక్తి, సద్గోష్ఠి, చక్కఁగాఁ గుదురుకొనెను.

రామతీర్థుని బాల్యము చాల శోచనీయస్థితిలోనే జరగెను. కన్నతల్లి లేక కలిమి లేక పోఁతపాలతోఁ జేఁత బొమ్మలతోఁ గడచిన యాతని శైశవావస్థ – ఆ పిమ్మట నూరం బడిలో నోరు లేక వాయి లేక యున్న యా తల్లిలేని పిల్లవాని

నెల్లురుపిల్లలును బడిపంతులును నీచముగాఁ జూచుచుండ జరిగిన బాల్యావస్థ - రామరత్నమునకు సానబట్టి మెఱుఁగు పెట్టి ధగధగ మెఱయునట్లు చేయఁగలిగినవి.

## విద్య

ఐదవయేఁట నక్షరాభ్యాసమై యున్నయూరిబడిలో నున్న మైదుతరగతులు గడచునరికి కాతనికిఁ బదేండ్లు వచ్చెను. ఆ పిమ్మట హీరానందుఁడు పుత్త్రుని గుజరన్వాలానగరమునఁ గల యున్నతపాఠశాలలోఁ బ్రవేశపెట్టి భగవద్భక్తుఁడను నొక యుపాధ్యాయుని కొప్పగించెను. తరగతికిఁ జెప్పవలసిన సామాన్యపాఠములే కాక భక్తిజ్ఞానబోధకములగు నెన్నోవిషయముల నరఁటిపండొలిచి చేతి కందిచ్చినట్లాగురువు చెప్పుచుండుటచే నాతఁడే రామతీర్థున కాధ్యాత్మిక గురువుకూడనై రామతీర్థుని లేఁతహృదయమున నెన్నిటినో పూతభావముల బీజములను నాఁటెను. అవి క్రమముగా నాతని బుద్ధివికాసమున కెంతయో తోడ్పడెను.

“తన కొకగతి లేదు. మెడ కొకడో” లన్నట్లు గర్భదరిద్రుఁడగు రామతీర్థునకుఁ బదవయేఁటనే పెండ్లికూడ నయ్యెను. ఆ దినము లట్టివి. బాల్యవివాహములే పరమాదర్శములుగఁ దలఁచువారు ప్రజలు. పెండ్లి యన్నఁ బల్లకి నెక్కి యూరేఁగుటే యని యుప్పొంగువారు వధూవరులు. చిలుక గోరింక లని ముద్దులమూటలని మక్కువతో ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డ

లగు వధూవరుల నెల్లరు ముద్దిడుకొనువారు. ఆ పెండ్లిండ్లు బొమ్మల పెండ్లిండ్లవలె నుండెడివి.

ఈ పెండ్లి వలనఁ జదువున కేయభ్యంతరము లేక రామతీర్థుఁడు తన పదునైదవయేఁట 'మెట్రిక్యులేషను' పరీక్షలోఁ దరగతికిఁ బ్రథముఁడుగా నుత్తీర్ణుఁడయ్యెను. అపుడా యూరి సంఘమువారొక రీతనికిఁ గళాశాలలోఁ జదువుటకు వలయు జీతము నొసఁగి సత్కరించిరి.

కాని, హీరానందుఁడు దరిద్రబాధ పడలేక తనపుత్త్రుఁ జేచిన్నయుద్యోగమునన్నైనఁ బ్రవేశించి నాలుగుడాళ్ళు తెచ్చుచోఁ దనకు శ్రమ తగ్గునని యెంచి యాతఁడు రామతీర్థు నుద్యోగములోఁ బ్రవేశింపు మనెనేకాని కళాశాల విద్య కనుమతింపలేదు. రామతీర్థుఁ డీవిషయమునఁ దండ్రిమాట త్రోసి రాజని లాహోరు కళాశాలలో 'ఇంటరు' తరగతిలోఁ జేరెను. అప్పటి కాతని భార్యయుఁ గాఁపురమునకు వచ్చెను. తండ్రి నిర్ధనుఁడగుటవలన, రామతీర్థుఁడే భార్యను లాహోరు తీసికొనివచ్చి యొక పాడింటిలోఁ దక్కువయద్దె కొకభాగము తీసికొని యందు సంసార మారంభించెను. తాను గళాశాలలోఁ జదువుకొనుచునే తీఱికసమయముల నిరువుర ముప్వురు బాలురకుఁ బాఠములుచెప్పి నాలుగురూకలు సంపాదించి యొంటి పూఁటయే భోజనము చేయుచు నెన్నియో యిక్కటు లనుభవించుచు సవ్యసాచివలెఁ జదువును సంసారమును సాఁగించి 'నిశ్చితార్థంబు విడువరు నిపుణమతు' లన్నట్లు రామతీర్థుఁడు

పదునెనిమిదివందల తొంబదవ సంవత్సరమున విశ్వవిద్యాల యమునకే తొలివాఁడుగా 'యఫ్.ఏ.' లో నుత్తీర్ణుఁడయ్యెను.

పరీక్షలో లభించిన యుత్తమ విజయమువలన రామ తీర్థుఁడు ప్రభుత్వమువారి యుపకార వేతనము నందఁ గని పట్ట పరీక్ష కచటనే చదువఁజొచ్చెను. కాని, యట నాతఁడు దారిద్ర్య మను మహాసముద్రము నీఁదవలసి వచ్చెను. ఒక పూఁట తిండి యున్నదిన మాతనికిఁ బర్వమయ్యెను. పక్షమున కేకాదశి యొకటియే కాని యాతనికిఁ బదిపండ్రెండేకాదసులు చచ్చు లెక్కను వచ్చుచుండెడివి. దైవరక్షలే కాని యాత నికిఁ బాదరక్షలే లేవు. ఒకనాఁ డితనియింట దొంగలు పడి యున్న కొన్ని పప్పుప్పులనే కొనిపోయిరి. మఱునాఁ డుద యము రామతీర్థుఁ డుబ్బి గంతులు వైచుచుండుటఁ గని భార్య కారణ మడిగెను. 'నా పుస్తకములలో నొక్కటియుఁ బోనందుల' కని యాతఁడు జవాబిచ్చెను. ఏమి దారిద్ర్యము! కాని, లేమికిఁ గుందుట సామాన్యలక్షణము, లేమి హెచ్చిన కొలఁది ధైర్యము హెచ్చుచుండుట మహాపురుషలక్షణము.

ఇట్లు రెండువత్సరములు కడపి పట్టపరీక్షకుఁ గూర్చున్న రామతీర్థుఁడు దైవవశమునఁ గృతార్థుఁడు కాలేకపోయెను. ఆంగ్లమున మూఁడు గుణములు తక్కువ వచ్చుట కారణము. మరలఁ జదువుటకుఁ జేతఁ బైసలేదు. దొరతనమువారి యుప కార వేతన మూడిపోయినది. కాని, యెట్లెట్లో యుపవాసము లతోఁ గాలము గడపి మరలఁ బరీక్షకుఁ గూర్చుండి ప్రప్రథమ

ముగాఁ నాతఁడు గొలుపొందెను. దానివలనఁ జదువుటకు మరల నుపకారవేతన మొకటి లభింప నాతఁడు ఎం. ఏ. చదువుచుఁ దీఱికవేళలలోఁ బాఠములు చెప్పి కొంతధనము సంపాదించుచు దారిద్ర్యమునుండి బయటపడుచు శ్రమపడి ఎం. ఏ. పరీక్షలోఁగూడఁ గృతార్థుఁడు కాఁగలిగెను.

## ఉ ద్యో గ ము

ఈవిధముగ నాతఁ డెన్నికష్టములో దాఁటి యున్నత విద్య నభ్యసించెను. కాని, తగిన యుద్యోగము లభింపఁ దాయెను. అంత నాతఁ డొక సొంతబడి పెట్టి కొంతకాలము కాలక్షేపముచేసియు, నొకధార్మికసంస్థకుఁ గార్యదర్శిగానుండి కొంతకాలము పనిచేసియు, నెట్లో దినములు వెళ్ళఁబుచ్చుచు నుండి యొక యున్నతపాఠశాలలో గణితశాస్త్రోపాధ్యాయుఁడుగాఁ గొంతకాలము పనిచేసి తుదకు మఱియొకవత్సరము లోపుననే తాను జదివిన లాహోరుకళాశాలలోనే గణిత శాస్త్రాచార్యుఁడుగా నుద్యోగము సంపాదించెను.

ఈ యాచార్యపదవిలో రామతీర్థునకు సంఘమున విద్యార్థులలో నమితగౌరవము లభించెను. కాని, గౌరవమునే విషముగాఁ జూచు నామహాపురుషున కీగౌరవముపై లేశమైనను గౌరవము కలుగదాయెను. ఒకవంక నాతఁ డనుభవించిన మహాకష్టము లాతనికి వైరాగ్యబుద్ధిని గలిగించి యుద్యోగము సంసారము మున్నగు వానిపై నసహ్యాభావమును బెంపొందింపఁ జొచ్చెను. మఱియొకవంక దేశదుఃస్థితికి దేశపరాధీనతకుఁ బ్రతిదిన మాతనిపూతహృదయము తపించి

పోవుచుండెను. దేశభక్తిపై నాతఁడనేకోపన్యాసము లొసఁగి దేశస్వాతంత్ర్య మార్జించుట కెల్లరు సర్వత్యాగములు నొనరించి నడుము కట్టి నిలువవలయు ననియెందఱనో దేశభక్తిపరుల నొనరించెను.

రామతీర్థుఁ డీయున్నతోద్యోగమున రెండేండ్లు పని చేయఁగలిగెను. తరువాత నాతఁడు స్వార్థపరుఁడగు సామాన్య మానవుని వలె పొట్టకూటికై గడనకై తనజీవితమును వ్యర్థము చేసికొనరాదని నిశ్చయించుకొనెను.

## భక్తి

అతనికి రామునిపైఁ జెప్పరానిభక్తి. కృష్ణునిపై నింతింతనరానిరక్తి. రామతీర్థుఁ డొంటరిగా రేయింబవళ్ళు కన్నీరు మున్నీరుగా రామునికొఱకుఁ గృష్ణునికొఱకు నేడ్చువాఁడు. అతనికి రామభక్తితోపాటు విజ్ఞానముపై మిక్కిలి కోరిక కలిగెను. మొదట నాతఁడు మన దేశీయ విజ్ఞాన మంతయు నలవఱచుకొనఁగోరి పురాణములు, వేదశాస్త్రములు, భగవద్గీత, ఉపనిషత్తులు, షడ్దర్శనములు, సర్వమతసిద్ధాంతములు, ప్రాచీన మహర్షుల జీవితములు, నుపదేశములు చదివి చదివి యందలి సారమును దన హృదయభాండమున దాఁచుకొనెను. ఆపిమ్మట రామతీర్థుఁడు, సూరదాసు, కబీరు, తుకారాము, రామదాసస్వామి మున్నగువారిజీవితములు వారి భక్తితత్త్వము నవగాహనము చేసికొనెను. అంతేకాదు, అతఁడు హాఫిజ్, అత్తర్, షామ్సుటాబ్రెజ్, మౌలానా రూము మున్నగు మహమ్మదీయ

ప్రవక్తలహృదయముల నెఱుఁగుటకై వారివారిని గూర్చిన గ్రంథములను, అట్లే పాశ్చాత్యదేశతత్త్వజ్ఞుల నెఱుఁగుటకై కాంటు, సోపెన్‌హార్, ఫిక్టే, హెగెల్, గథే, కార్లైలు, మున్నగువారి గ్రంథములను, మఱియు, భౌతికశాస్త్రవేత్తలగు స్పినోజా, స్పెన్సరు, డార్విను, హెగెల్, హక్స్లీ, సర్ జేమ్సు జీన్సు మున్నగువారిగ్రంథములను క్షుణ్ణముగాఁ జదివి నిపుణముగా నర్థముచేసికొని యాతఁడు తన విజ్ఞానమును వేయి మడుఁగుల వికసింపఁజేసికొనెను. ఆపిమ్మట నాతఁడు గ్రహించినది భారతీయవిజ్ఞానమే ప్రపంచవిజ్ఞానముల నన్నివిధముల మిన్న యన్నది. దాని ననుసరించి యాతఁడు భక్తిజ్ఞానవైరాగ్యముల నాశ్రయించి తాను దరించి యితరులను దరింపఁజేసి దేశము నుద్ధరించుటయే కర్తవ్య మని నిర్ణయించుకొనెను.

ఈదినములలోనే వివేకానందుఁ డను మన దేశీయుఁడు తత్త్వనిధియై సన్న్యసించి పాశ్చాత్యుల కెల్లరకు మన దేశౌన్నత్యమును గూర్చి చెప్పి తన్మయులఁ జేసి లాహోరు తిరిగి వచ్చెను. అపుడు రామతీర్థుఁడే యాతని నాహ్వానించి గౌరవించెను.

ఒకనిప్పుకణ మున్న దన్న దానిని విసరినపుడే యది పెద్దదై జ్వాల యగును. దానిపై నొకనీటిచుక్క చల్లినచో నది యారిపోవును. ఇది సహజము. అట్లే రామతీర్థునిలో నున్న జ్ఞానకాంక్ష, దేశభక్తి, వైరాగ్యము మున్నగు నగ్నికణములు వివేకానందుఁ నుడవాయువు సాంగత్యమువలన నెక్కువ ప్రజ్వలించెను.

## యాత్ర

స్వేచ్ఛగాఁ దిరుగఁ గోరునొకపక్షిని వేయియాఁచల పంజరములోఁ బెట్టి బంధించినచో దానిగతి యెట్లుండునో యట్లే రామతీర్థునిస్థితి యుండెను. ఆతనిని బంధించినవానిలో మొదటి దుద్యోగము రెండవది సంసారము. పదిగంటలు కొట్టుసరికి నిజముగాఁ గళాశాల కేఁగవలయును. ఆఁకలిగ నున్నను నజీర్ణముగ నున్నను దొమ్మిదింటికి భోజనము చేసి తీరవలయును. ఆఁకలి వేయుచున్నదని యన్నము తినుటకాదు. తొమ్మిదిగంటలు కొట్టినది కనుక. విద్యార్థులకుఁ జదువు కావలసినను నక్కఱలేకపోయినను నుపాధ్యాయుఁడుమాత్రము బోధార్థియై పాఠము చెప్పవలసినదే. అది బూడిదఁ బోసిన పన్నీరగుఁ గాక! అడవినిగాచిన వెన్నెల యగుఁగాక! అది యాతనికి సంబంధించిన విషయముకాదు, తనవిధి తాను నెఱవేర్చిన మెప్పుండవచ్చును. లేకపోవచ్చును. కాని, తనపని తాను జేయని నాఁ డాతనికి ముప్పుమాత్రము తప్పదు. ఇట్టి యనేక బాధ లాతఁడు తొలఁగించుకొనఁగోరి తొలుదొలుతఁ గళాశాలోద్యోగ మాతఁడు తృణప్రాయముగా విడిచి వేసెను. ఆవాతావరణమునుండి తన హృదయమును ప్రశాంతవాతావరణమునకుఁ ద్రిప్పుకొనఁదలఁచి యొకసారి హరిద్వారము హృషీకేశము మున్నగుచోటుల కేఁగి తిరిగి యాతఁడిల్లు చేరుకొనెను. అపు డాతఁడు దినమున కొకటి రెండుగంటలే పని చేసిన వెనుకటిజీతమేవచ్చు ప్రాచ్యకళాశాలాచార్యపదవి నంగీకరించి కొన్ని మాసములే యాయుద్యోగము చేసి

యుదియుఁ దనమదికి సరిపడనందున దానినిసైత మాతఁడు విసిచివేసెను.

## సన్న్యాసము

రామతీర్థుఁడు విజ్ఞానియే కాక పత్త్రికాసంపాదకత్వమున మిక్కిలి నిపుణత గలవాఁడు. తనభావములకు రూపములు తీర్చి దిద్దవచ్చు ననియు స్వతంత్రోద్యోగ మనియు నాతఁడు "ఆనందముద్రాలయ" మనుపేర నొక యచ్చుకూటము నెలకొల్పి "అలీఫ్" అను పత్త్రిక సాగించి యందాతఁడు మన దేశీయతత్త్వమును గూర్చి చాలఁ జక్కఁగా మృదు మధుర భాషలో వ్యాసములు వ్రాసి ప్రకటించెను. కాని, యాతని కిదియు నచ్చదయ్యెను. తనపుట్టుక చరితార్థ మగు నుపాయమును గానక వెఱ్ఱివెఱ్ఱి ప్రేలాపనలతోఁ గాలము వెళ్లఁబుచ్చువానికంటె వేఱొక యవివేకి యాతనికిఁ బొడకట్టఁడయ్యెను. ఔను. తేనెగలపూవునకై తుమ్మెద రొదచేయుచుఁ దిరుగుచునేయుండును, లేఁతయాకుల నిగనిగ, పూఁతకొమ్మల తళతళ, మఱి యేమియు దానికి నచ్చవు.

పూవు పుట్టినందులకుఁ గాయ కాయవలయును. లేనిచో దాని కందము లేదు. దానినే గొడ్డుపు వ్వందురు. అట్లే దంపతులకు. రామతీర్థునకుఁ గుమారుఁ డొకఁ డుదయించెను. అతనికి రామతీర్థుఁడు బ్రహ్మానందుఁ డని పేరుపెట్టెను. ఆబిడ్డ యల్లారు ముద్దుగాఁ బెరుఁగుచున్నపుడే రామతీర్థుఁడు వానప్రస్థాశ్రమమును నడపఁగోరి భార్యతో బిడ్డతోఁ గొందఱు

మిత్రులతో నేమియుఁ గైకొనక యుత్తచేతులతోడనే బయలు దేఱి "సెహారీ" మీఁదుగాఁ బయనింపఁ దొడఁగెను. కాని, యాతనిస్థితి వేఱు, కూడ నున్న భార్య, బిడ్డ, మిత్రులు, వీరి స్థితి వేఱు. వా రాతనితో నిఁక క్షణమైనఁ దూఁగలేకపోయిరి. భార్యాదీనాననముఁ జూచి యాతఁడు భార్యను బిడ్డను నింటికిఁ బంపించి బుద్ధభగవానునివలె విడిచివేసెను. ఆతఁ డీరీతి దేవుని కొఱకే యుద్యోగము, ధనము, భార్య, బిడ్డ, సర్వమును, విడిచిపెట్టఁ గలిగెను.

బాహ్యముగనే కాక రామతీర్థుఁడు మానసికముగఁ గూడ నన్ని కోరికలు, నన్ని మమకారములు, విడిచి ౧౯౦౧ వ సంవత్సరమున సర్వసంగపరిత్యాగము నొనర్చి సన్న్యాసి యయ్యెను. నాఁటినుండియే యతఁడు రామతీర్థస్వామి యయ్యెను.

## జపాను పర్యటనము

రామతీర్థుఁ డిట్లు సన్న్యసించి యరణ్యములలో నొంటరిగాఁ దిరుగాడుచు నెండవానలకుఁ జీకుచింతలకు దేనికిని లక్ష్యపెట్టక సదా భగవంతునిగుఱించియే తలపోయఁ దొడఁగెను. ఆఁకలికిఁ గటికి ఱాళ్లే పట్టుపఱుపులు. చేయియే తలగడ. ఆకాశమే భూమియను మంచమునకు వేసినపందిరి. ఆతఁ డట్లు దినములు కడపుచుఁ బూర్వఋషులవలెఁ దపస్సుచేసి యాతపోధనమువలన దేశమునకు స్వాతంత్రత గొని తెత్తు ననెడివాఁడు. ఆతఁడు తానే దేశము దేశమే తానుగా భావించి మహాదేశభక్తుఁడయ్యెను. "నేనే శివుఁడను, మలబారు, చోళమండలము

పీనితీరములు నాకాళ్ళు. రాజపుత్రస్థానములోని యెడారియే నాజోమ్ము. వింధ్యప్రదేశమే నా కటిస్థలము. నా చేతులను దూర్పుపడమరల కతివిస్తారముగా నేను జాపినాఁడను. హిమాలయశిఖరములే నాశిఖలు. అందుండియే గంగానది ప్రవహించును. నేనే భారతదేశమును". ఇది యాతని భావము.

ఇట్లాతఁడు టెహరీదేశమునఁ దిరుగాడుచుండ నా దేశపు రాజు రామతీర్థుని గొప్పతనమును విని వచ్చి యాతని నెంతయుఁ బూజించెను. పిమ్మట నొక పర్యాయము టెహరీ రాజు వచ్చి జపాను దేశములో సర్వమత మహాసభ జరుగఁ బోవుచున్నదనియు దానికి వెడలి భారతమతమును గుఱించి యుపన్యసించి రమ్మనియు రామతీర్థుని గోరెను.

ఇదియే దేవుని యాజ్ఞగా గ్రహించి రామతీర్థస్వామి పయనమై జపానుచేరెను. అచటి భారతీయులు స్వామికి ఘన స్వాగతము నొసఁగిరి. అచటి భారతీయులలోఁ బేరెన్నికగన్న పురాణసింగను పంజాబుకవి రామతీర్థునిఁ దొలుత నటనే కలిసికొని యాతనికి శిష్యుఁడయ్యెను.

జపానులోని ప్రధాననగరమగు టోకియో చేరి రామతీర్థుఁడు బౌద్ధవిశ్వవిద్యాలయములో "భారతదేశవిజ్ఞానమును" గుఱించి యద్భుతముగా నుపన్యసించెను. ఆ దేశవాసులు ముగ్ధులై వినిరి. నిజమున కాదేశమున సర్వమత మహాసభ యేమియు జరగదని రామతీర్థుఁనకు దరువాతఁ దెలిసెను. ఐనను, వచ్చినవాఁ డెట్లైనను తానే వచ్చినాఁడని యాతని

నా దేశవాసులు విడువలేదు. ఆతఁడు వారి నాదరించి యెన్నో యుపన్యాసము లిచ్చి వారి నానందపఱిచెను. టోకియో పారిశ్రామిక కళాశాలాభవనమున రామతీర్థస్వామి "కర్మవిజయ రహస్యమును" గుఱించి యుపన్యసించెను. మఱొకమాఱు జపాను దేశమునకు మన దేశమునకుఁ గల సన్నిహితసంబంధమును గుఱించి యుపన్యసించెను. ఇట్లెన్నియో చోట్ల నాతఁ డెన్నియో యుపన్యాసము లిచ్చి మన దేశీయతత్త్వజ్ఞానమును గుఱించియు మన దేశౌన్నత్యమును గుఱించియు వారికిఁగల దుర్భ్రమలఁ దొలఁగించి వారికి మనపై నమిత గౌరవము కలుగునట్లు చేయఁగలిగెను.

ఈ విధమున భారత దేశగౌరవమును జపాను దేశమునఁ జాటుకొలిపి జపానీయులు భారతీయులు నొకేజాతివా రని ధ్రువపఱిచి రామతీర్థస్వామి స్వదేశమునకుఁ దిరిగివచ్చెను.

## అమెరికా పర్యటనము

కాని, యనతికాలముననే యాతని కమెరికాదేశమునకుఁ గూడ నొకపరిపోయి యటకూడ భారతదేశమహత్త్వమును దేటతెల్లముగాఁ జాటిరావలయునని తోఁచెను. ఆతని సంకల్పమున కడ్డువచ్చువా రెవరు? తోఁచినదే తడవుగా రామతీర్థస్వామి యమెరికా దేశమునకుఁ బయనమై పోయెను. అతఁడు "కాలిఫోర్నియా" చేరి యచటనే కొంతకాలము వసించెను. అట డాక్టరు హిల్లరువంటి జగత్ప్రసిద్ధతత్త్వజ్ఞులు రామతీర్థుని సేవకులైరి. ఆతఁడట వివిధప్రదేశములలో వివిధవిషయములనుగూర్చి- భారతీయతత్త్వము, కర్మ, జీవితరించుటెట్లు? భారత దేశమునకు

వివిధదేశము లాధ్యాత్మికముగ నప్పువడుట, అమెరికావారు భారతీయులకు సహాయపడుటెట్లు? అమెరికాకు రక్షణోపాయము, భారతీయ శాశ్వతతత్త్వము, ప్రపంచవిజ్ఞానములలో భారతీయ విజ్ఞానమే యున్నతమైనది, ఇత్యాది మహావిషయములనుగుఱించి- జనులు పరవశు లగున ట్లుపన్యసించెను. అమెరికా పత్త్రికలు రామతీర్థుని మహాప్రతిజ్ఞనుగుఱించి సంపాదకీయములు ప్రశంసాలేఖలు ప్రకటించెను. అపుడా దేశమున నితనిని మెచ్చనివా రేలేరు. ఈ యుపన్యాసపరంపరలచే స్వామి కెందఱో స్త్రీలు,పురుషులు శిష్యులై పాదసేవ చేయఁ దొడఁగిరి. "వెల్మన్" సతి వీరిలో నగ్రగణ్యురాలు.

అమెరికాలో రామతీర్థుఁ డిచ్చిన యుపన్యాసములు లెక్కకు మిక్కిలియైనవి. భారతీయుల మతమును గుఱించి యాతఁడు పలికినమాటలు చాలగొప్పవి. "నామతము హిందూమతము కాదు. మహమ్మదీయమతము కాదు. క్రైస్తవ మతము కాదు. కాని, వీనిలో దేనికిని వ్యతిరేకముకాదు. విశ్వరంగమే నామతమునకుఁ బుట్టినిల్లు. మహమ్మదీయాకాశము, హిందూ నక్షత్రములు లేనట్లే నాకు నిన్ని మతభేదములులేవు. సమస్త ప్రాణికోటులు నామతమునకుఁ బునాదులు. నా మతము పేరు లేని మతము. నేను దానికిఁ బేరుపెట్టి బాధపడను. మమకారము చూపను. సూర్యకిరణములవలె నే నితరులనుండి ప్రతిఫలము కోరకే సర్వప్రాణులకు సేవ చేసెదను."

అమెరికాదేశీయులకు రామతీర్థస్వామి చేసిన హితోపదేశ సారాంశమిది, "ఓధనవంతులగు నమెరికాదేశీయులారా!

మీరు కని విని యెఱుఁగనంత పుణ్యదేశము భారతదేశము. మీ రామె సేవ చేసి తరింపుఁడు. నిరక్షరాస్యు లగునట్టి జనులకు మీరు పోయి విద్యావ్యాప్తి చేయుఁడు. ధనమదాంధులగు మీరు భారతదేశమునకు ధనసాహాయ్యము, పారిశ్రామిక సాహాయ్యము, నొసరింపుఁడు. భారతదేశమార్థికముగానున్నత స్థితి నందిన-చో మీకుఁ బ్రియమిత్రము కాఁగలదు. ఆంగ్లేయులు మా దేశప్రజలను బిండి పిప్పిచేయుచున్నారు. మీరు చూచుచు నూరకుందురా ? మా భారతదేశముపైఁ బడి రక్తమును జుఱ్ఱివేసి మమ్ములను నిర్జీవులను జేయుచున్న యాంగ్ల మత్కుణములను మీ రేమియుఁ జేయలేరా ? చేయఁగలరు. మీ విధి మీరు నిర్వర్తింపుఁడు. భారతక్షేమమునుజూడుఁడు.

"ఏఁటేటఁ గాటకములచే లక్షలకొలఁది జనులు చనిపోవుచుండఁగా, యువతీ యువకు లగు జను "లన్నమో రామచంద్రా!" యని యాఁకటిచిచ్చునఁ బడి మ్రగ్గిపోవుచుండఁగా, లోకోత్తరపురుషులు కాఁదగిన విద్యార్థులు విద్య లేక దరిద్రు లగుచుండఁగాఁ జూచుచుఁ దమకడుపు తాము నింపుకొనుచు మా భాగ్యములు తాము దోఁచుకొని పోయి తమ దేశమునఁ జేర్చుచుండుట చాలక పైపెచ్చు మొదట నే తలమించిన పన్నులతో బాధపడు మాపై నింకను రకరకముల పన్నులు వేసి, చెమట యూడ్చి పనిచేయు కార్మిక కర్షకులనుండి నిఱుపేదలనుండి రక్తము నెముకలు కూడఁ బీల్చివేయు మా ప్రభుత్వ నేమనవలయును ?

"ప్రపంచమునకు జ్ఞాన మనుపాలను మిక్కుటముగా నొసఁగియున్న - ఒసఁగుచున్న - హిందూగోమాత నేఁడాఁకలి దప్పుల కాలవాలమై నీరసించి నిస్త్రాణమైనది. ఆమెకుఁ బ్రాణములు నిలుపవలసిన బాధ్యత మీకు లేదా? పశ్చిమాంసమును దిను మీపశ్చిమజాతులు మాగోవును గోసికొని తినఁ జూచుచున్నవి. కానిండు. ఒకటిమాత్రము మఱవకుఁడు. మీరు నఱకి దాని మాంసమునే తినవలయునన్నను ముందు దానికి మేఁతపెట్టి నీరుపోసి పుష్టి చేకూర్పవలయును! రోగగ్రస్తమగు నావుమాంసము మీప్రాణములనే తీయఁగలదు సుఁడీ."

ఈ ప్రకార మనేకవిధములఁ దీవ్రాభిప్రాయములను వెలిపుచ్చి రామతీర్థస్వామి యమెరికాప్రజల సౌహార్దమును గడించి మనదేశముపై నాదేశస్థులకు నిరుపమానగౌరవము గలుగునట్లు చేసి కృతకృత్యుఁ డయ్యెను.

## పునరాగమనము.

తనపని నెఱవేఱిన వెంటనే యతఁడు ౧౯౦౪ వ సంవత్సరమున మనదేశమునకుఁ దిరిగివచ్చెను. కాని, యింతఘనకార్యముచేసినను నాతఁ డేమాత్రము గర్వింపకుండుట యాతని శీలవిశేషము. అమెరికాపత్త్రికలాతనినిగుఱించి చేసినపొగడ్తల నన్నిపత్త్రికలనుండి కత్తిరించి వాని నన్నిటి నొక కట్ట కట్టి యాతని కెవరో యీయఁగా నాతఁడు వానిని జూడనైనఁజూడక గంగానదిలోఁ బాఱవైచి చేతులు కడుగుకొనెనఁట. దీనివలన నాతఁడు నిగర్వచూడామణియనినిశ్చయముగాఁ జెప్ప వచ్చును

గదా! అమెరికాలో స్వామియుపన్యాసముల సంగతి పత్రికల వలనఁ దెలిసికొని మన దేశసంస్థలు కొన్ని స్వామి తిరిగివచ్చునపుడు ముందుగాఁ దమకుఁ దెలుపవలసిన దనియు స్వామి భారత దేశమున దిగఁగానే ఘనస్వాగత మిచ్చి సమ్మానపత్రములు సమర్పింతు మనియు నాతనికి వ్రాసినవఁట.

"అవమానమే యమృతము; గౌరవమే విషము" అని యెంచి ప్రవర్తించిన రామతీర్థుఁ డీయుత్తరములకు జవాబీయక పోవుటే కాక, రెండవకంటివానికైనఁ దెలియకుండ నాతఁ డీ దేశము వచ్చిచేరెను. ఆపిమ్మట నాతఁడు యమునానదీ తీరమున నొక యాశ్రమమును నిర్మించుకొని యందే కాలము పుచ్చుచుండెను. అదియే "శాంత్యాశ్రమము." అతనితో నట నొక పారశీకపండితుఁడు కూడ నుండెను.

ఆకాలముననే యాతనికి దేశభక్తి మిక్కిలియధికము కాఁజొచ్చెను. "త్యాగమే మన దేశమునకు స్వతంత్రతనీయఁ గలదు. మన దేశీయు లంద ఱందులకు సిద్ధపడవలయును. నా దేశము స్వతంత్ర మగుటకై నాతల నే నెఱ యిచ్చెదను. మీ రెల్లరు నిచ్చి తీరవలయును. సిద్ధము కండు. అపుడే మన దేశమునందలి యజ్ఞానదైన్యములను మనము పటాపంచలు చేయఁగలము."

"భారతదేశమునకు స్వాతంత్ర్యములభించుటకై నాతప మంతయు ధారపోయుదును. మన దేశము స్వతంత్ర మైతీరును. నేనొక్కఁడనైకాని యనేకులలోనుండి కాని మన దేశస్వాతంత్ర్యము నార్జించెదను. ౧౯౫౦ వ సంవత్సరము వచ్చులోపుననే

మన దేశము స్వతంత్రమై యపూర్వ మహోన్నతస్థితికి రాఁ గలదు. ఈనామాటలు వ్రాసి యుంచుకొనుఁడు. ఇది సత్య మని కాలమే నిర్ణయించును."

ఈ యుపన్యాసములు విన్న ప్రభుత్వోద్యోగులు రామ తీర్థుని విప్లవకారునిగా భావించి యాతని దినచర్యలు పరికింప గూఢచారులను నియమించిరి. వారి నాతఁడు లెక్కచేయక వారికిని దేశభక్తిని బోధించి దేశద్రోహము చేయకుఁడని బుద్ధిచెప్ప వారు తమయుద్యోగధర్మమును దాము నిర్వహించు చుంటిమే కాని యన్యము కాదని చెప్పి వెడలిపోవుచుండువారు.

అటనుండి కదలి యాతఁడు పుష్కరతీర్థమును జేరి యట 'కృష్ణఘర్' భవనమున బసచేసియు నిరంతర మాతఁడు పుష్కరతీర్థ సమీపముననే 'ఓంకారము' నుచ్చరించుచుఁ దిరుగువాఁడు. భారతదేశమున కింకను సేవ చేయు టెట్లని యాతఁడు నిరంతర మాలోచించుచునే యుండువాఁడు.

ప్రపంచములోఁ గల జాతులన్నియు మన దేశమునఁ గలవు. అన్ని మతములకు నిట స్థావరము కలదు. భాషా భేదము, మతభేదము, జాతిభేదము మున్నగునవి పరరాజ్య వృక్షమున కిటఁ గూఁకటివేళ్లైనవి. ఈ వేళ్ళను నఱికిననే కాని జాతి బాగుపడదు. రామతీర్థుఁ డిది గ్రహించి జాతిమత శాఖా భేదవిరోధము లంతరించుటకై యెన్నియో యుపన్యాసము లిచ్చి ప్రజల నైకమత్యసూత్రబద్ధుల నొనరింపఁ గృషిచేసెను.

## ఉపదేశములు

రామతీర్థుఁడు భారతజాతి కొసఁగిన యుపదేశామృతము మిక్కిలి మధురమైనది. అది శాశ్వతమైనది. మహాపురుషుల మహావాక్యము లొకనాఁ డుండి యొకనాఁడు పోవునవి కావు. అవి నిత్యనూతనములు. కావున, రామతీర్థుని యుపదేశములను సంగ్రహముగా నిట గ్రహింతము.

"విఖ్యాత నగరములో జరుగుపని యెంత పవిత్రమైనదో పేరులేని మాఱుమూలలఁ బల్లెటూళ్ళలో జరగు పనియు నంత ఘనమైనదే. బండిచక్రములోని యిరుసు చిన్న ముక్కయే. అది లేనిచో బండి పడిపోదా ? సూర్యబింబము నెదుట మంచుబిందువు లెక్కలోనిదా ? కాని, యది సూర్యబింబమును దనలోఁ బ్రతిబింబింపఁ జేసికొను నద్భుతశక్తి గలది. అట్లే ప్రతి చిన్న జీవియుఁ దనలో నొక యద్భుత మగు శక్తిని గలిగియేయుండును. కావున, మనము చిన్న పనులను నిరసించుట, పెద్దపనులను భూషించుట చేయరానిపని."

"కలలోఁ గాంచినవిషయములను మనము మనసులోఁ బెట్టుకొని బాధపడక యెట్లు మఱచిపోవుదుమో యట్లే మన శత్రువులనుగూర్చి, మనలను నిందించువారినిగూర్చి, బాధపడఁగూడదు. అట్లుకాక బాధపడుదుమా అవియే మందు లేని రోగములై మనలను మట్టుపెట్టును."

"సత్యమే యుత్తమమైనది. సత్యవంతునికడ సర్వసంపదలు నిలచును. సత్యవంతునే స్వాతంత్ర్యలక్ష్మి వరించును.

సత్యమే బలము. సత్యహీనుఁడే సత్త్వహీనుఁడు. సత్త్వహీనత కంటెఁ జావు మేలు. సత్త్వహీనతకు జనని యజ్ఞానము."

"ఒకరి నొకరు ద్వేషించుట కాని యొకరిలోపము లొకరెన్ని యెత్తిపొడుచుకొనుట కాని మన దేశైకమత్యమను చెట్టున కొక పెద్దగొడ్డలిపెట్టు. ఒకే భారతమాతకుఁ బుట్టి యాతల్లిపాలు త్రాగి పెరిగిన మనము హిందువులమని మహమ్మదీయులమని వేఱుపేరులు పెట్టుకొని కాట్లాడి పరస్పరము నశింపవలసిన దుర్గతి నెన్నఁడు నందకుందుముగాక !"

"శైవులకు శివుఁడై, వైష్ణవులకు విష్ణుఁడై, బౌద్ధులకు బుద్ధుఁడై, మహమ్మదీయులకు మహమ్మదై, క్రైస్తవులకు క్రీస్తై భారతపుణ్యమూర్తిగా నాకుఁ బ్రత్యక్షమైన భగవంతుని నేను సేవించెదను. ఓ భారతమాతా ! నీసమస్తరూపములలో నేను నిన్ను భజించెదను. గంగామాతవు నీవే. కాళికాదేవివి నీవే. దరిద్రబాధచే నడలుచున్న ప్రతిజీవికిని దల్లివి నీవే. నిన్నారాధించుటే దైవము నారాధించుట. ఇదే నామతము. ఇదే నాధర్మము. ఇదే ప్రతిభారతీయుని ధర్మమును."

"జాతిలోఁ జీలికలు పెంపొందించుకొనియే యిదివఱలో భారతదేశము తనతలుపులను దోఁపిడిగాండ్రకు దొంగలకుఁ దెఱచియిచ్చి తనయిల్లు గుల్లచేసికొన్నది; విజాతీయుల నెంద ఱినో శిష్టమృష్టాన్నములతోఁ బోషించి తనకన్న బిడ్డలకే కఱవును సమకూర్చుకొన్నది. ఈదుఃస్థితిని దెలిసికొన్నయామె బిడ్డలందఱు నైక్యసూత్రమును బేని బాగుపడవలదా ?"

"భారతదేశచరిత్రమందలి క్లిష్టపరిస్థితులలో మనమేల జన్మించితిమని మనము విచారింపరాదు. దేశసేవ చేయుటకింతయవకాశము కలిగిన కాలముగదా యని మనము సంతసింపవలసిన సమయ మిది. మనకు వీరత్వము, దూరదృష్టి, ఏకాగ్రత-ఇవి కావలయును. ఆపదల కోర్చినమన మింక సంపదల ననుభవింపఁగలము. రాత్రియంతయు సుఖముగా నిద్రపోయినవాఁడే యుదయమున లేచి యుత్సాహభరితుఁడై యారోగ్యవంతుఁడై తనకార్యముల నవలీలగా నిర్వహించుకొనఁగలఁడు. మనదేశ మింతవఱకుఁ బరదాస్యవ్యామోహమున సుఖసుషుప్తినంది యిపుడే మేలుకొనుచున్నది. ఆమె జాగ్రదవస్థ యద్భుతముగా నుండితీరును. ఆమెయున్నతి కిఁకఁ బట్టపగ్గము లుండవు. భారతసంతానములో మనము మేల్కొలుపవలసిన సుగుణములు పరస్పరగౌరవము, సోదరదృష్టి, సమన్వయభావము, వివిధశక్తి సమ్మేళనము, వ్యక్తిగౌరవము, వృత్తిగౌరవము."

"నీధనమును దొంగిలించువాఁడు దొంగ. కాని, నీ యజ్ఞాన మను కృత్రిమధనమును దొంగిలించుకొనిపోయి నాశముచేసి నిన్నుద్ధరించువాఁడు గురువు. కాన, గురువును సేవింపుము."

ఇట్లనంతములుగా నున్న రామతీర్థుని యుపదేశపరంపరలను సంగ్రహించుట సాధ్యము గానిపని. ఆతని ప్రతిరక్తనాళము దేశభక్తి, రామభక్తులతోఁ బునీత మైనదనియు నాతని ప్రతిశక్తియు నా రెండును బ్రజలలో వ్యాప్తమగుటకే వినియోగ పడినవనియుఁ దెలిసికొన్నఁ జాలును.

## నిర్యాణము

చావుపుట్టుకలు జీవికిఁ దప్పనిసరియైనవి. 'యద్దృశ్యమ్ తన్నశ్యమ్' అనగాఁ గంటికిఁ గానవగు ప్రతివస్తువు నెప్పటికో యొకప్పటికి నశించుతీరు నన్న విషయము సత్యము. మానవుఁడు చనిపోవుట యనఁగాఁ జినిఁగిపోయిన ప్రాఁతచొక్కా తీసి పాఱవేయుట యనియు నాతఁడు తిరిగి జనించుట యనఁగా నిగనిగలాడు క్రొత్తచొక్కా ధరించుట యనియు మనతత్త్వశాస్త్రము ఘోషించుచున్నది. కావునఁ, జావునకు వగవవలసినపనిలేదు.

రామతీర్థున కిప్పటికి ముప్పదిరెండు సంవత్సరములు నిండెను. ఆత్మతత్త్వము నెఱిఁగిన యాతనికిఁ జావు సమీపించినదని పూర్తిగాఁ దెలిసెను. చావన్న నాతని కిసుమంతయు భయము కలుగలేదు సరికదా మృత్యుదేవత నాతఁడు భక్తితో నాహ్వానించెను.

ఇట్లు మృతికాలము సమీపించుచుని యెఱిఁగి యాతఁడు నిరంతరము గంగాతీరముననే భగవంతుని యనంతలీలలను నాతని యనంతమహత్త్వమును దలపోసికొనుచు నానందముతో జ్ఞానమును గాంచి వెలుఁగొందెను. ఈ గంగాతీరమందలి యాతని యాశ్రమమునే "వసిష్ఠాశ్రమ"మని జనులు పిలుచువారు. ఆతఁ డంత్యకాలము సమీపించుతఱిఁ దనకడ నెవ్వరు నుండ రాదని తన ప్రియశిష్యులగు నారాయణస్వామి పురాణసింగులను దుదిసందేశములతో నటనుండి పంపివేసెను.

అది యక్టోబరు నెల, పదునెనిమిదవ తేది, పందొమ్మిదివందల యాఱవసంవత్సరము. నాఁడు దీపావళిపండగ. సత్యా

దేవి నరకాసురుని జంపినందులకుఁ బ్రజలు చేసికొను పండ
గయో లేక ముప్పదిరెండు సంవత్సరముల జీవితములోఁ దన
సాధనసిద్ధికిని భారతదేశ పునరుద్ధరణమునకును బాటుపడి కృత
కృత్యతఁ గన్న భారతపుత్త్రరత్నమగు రామతీర్థునకు వీడుకో
లిచ్చు నుత్సవమో తెలియరాదయ్యెను.

తానీశ్వరునిలో లీనమైపోవుచుంటిననియుఁ దనకొఱ
కెవ్వరును విచారింప వలదనియు నొక లేఖవ్రాసి యాశ్రమమునఁ
బెట్టి రామతీర్థుఁ డొంటరిగా "ఓంకారము" నుచ్చరించుచు
గంగానదిని సమీపించి యా పవిత్రమాతృగర్భమున లీనమై
పోయెను. అతఁడు నదిలో దిగినదారిని "ఓంకారము" తప్ప
మఱియొకటి వినరాదయ్యెను. "దేహమన్నది పంచకోశము,
అందుఁ జేరియున్నది మోహపాశ" మని మన బిచ్చగాండ్రు
సైతము పాడుపాట యెంతసత్యము! మోహపాశమును ద్రెంపి
యైదు భూతములతోఁ గూడిన తన శరీరము నా యైదుభూతము
లకు విడిచివైచి రామతీర్థుఁడు దివ్యత్వమును గాంచెను.

"అన్ని విజ్ఞానములకంటె భారతదేశ విజ్ఞానమే
గొప్పది. అన్నిమతములకంటె భారతమతమే విశాలమైనది.
అన్ని సుఖములకంటె నాత్మసుఖమే యున్నతము. అన్ని
సేవలకంటె దేశసేవయే గొప్పది. దేశసేవయే దైవసేవ.
ఐకమత్యమే దేశ క్షేమకరము. అన్ని కోరికలకంటె
దేవునిఁ గోరుకొనుటే వివేకము. దేవునికృపఁ బడయుటే
జీవితపరమార్థము." ఇవి రామతీర్థస్వామి జీవితమున
సాధించిన — మనకుఁ బ్రధానముగాఁ గానవైన —

యుత్తమసత్యములు. వీనిని గ్రహించి యాచరించుటే మన మీాతని చరిత్ర చదువుటవలని ఫలము.

శ్రీ రామతీర్థునిగుఱించి దీనబంధు సి. యఫ్. ఆండ్రూస్ పండితుఁడు, పంజాబుకవి శేఖరుఁడగు పురాణసింగు, 'దేశోద్ధారక' నాగేశ్వరరావుపంతులు నొసఁగిన యభిప్రాయముల నిట సంక్షేపముగాఁ బరికించి శ్రీరామతీర్థుని యుత్తమసందేశముతో నీతని సంక్షిప్త జీవితగాథను ముగింతము.

## దీనబంధు ఆండ్రూస్ పండితుఁడు

"శ్రీరామతీర్థస్వామి జీవితసందేశములు ప్రపంచమునందెల్లెడల మిక్కిలి ప్రకాశింపవలసి యున్నవి. ఆ మహామహుని దేశభక్తి, త్యాగశక్తి, దైవరక్తి నిరుపమానములు. అవి యెప్పటికప్పుడే క్రొత్తఁదనమును నూతనమాధురులను మనకుఁ జూపునాదర్శములైనవి. ఈస్వామి జీవిత మిదివఱకే యీాతని నెఱిఁగి ప్రేమించువారికి, నీతనిని గురుమూర్తిగా భావించువారికి, నీతని సమకాలికులకు మాత్రమే కాక యీాతఁడు భౌతికశరీరమును విడిచి పరమేశ్వరసాయుజ్యము నందినపిమ్మట బయలుదేఱు యువక బృందములకు, విద్యార్థి ప్రపంచమునకు ముఖ్యముగా నావేశజనకము నాదర్శప్రాయము కాఁగలదు.

## పంజాబు కవిశేఖరుఁడు పురాణసింగు

"ముప్పది రెండేండ్లలోఁ బరిసమాప్తమైన శ్రీరామతీర్థుని పవిత్ర జీవితచరిత్రము సకలలోక కళ్యాణదాయకము,

అతని జీవితము దేశసేవకు దైవసేవకు బలి యొసఁగఁబడినది. అజ్ఞానము, దీనత, త్యాగహీనత, సోమరితనము నున్నవారి కితని జీవితము జ్ఞానామృతమును, శౌర్యలక్ష్మిని, త్యాగసంపదను, నిరంతర కార్యశూరతను బ్రసాదింపఁగల దనుటలో సందేహము లేదు. లోకోద్ధారకు లగువారి జీవితము లట్టివి. అట్టి లోకోద్ధారకులలో శ్రీరామతీర్థుఁ డొకఁడు.

శ్రీరామతీర్థస్వామి నవీనభారత దేశమున నుత్తమ మగు దేశభక్తిని, నుజ్జ్వల మగు సాహసమును, నున్నత మగు నాత్మస్వాతంత్ర్యపిపాసను రేఁకెత్తించి రగులుకొలిపిన మహనీయుఁడు. అతఁడు బ్రహ్మవిద్యను దెలిసికొన్నపుడే శాశ్వతమగు సంతోషము కలుగుననియు నెల్లరు నాత్మసాధనచే దీని నందినయెడల నే ప్రపంచసమస్య లన్నియుఁ బరిష్కారము లగు ననియుఁ దన జీవితమున ధ్రువపఱచియున్నాఁడు."

## నాగేశ్వరరావు పంతులు

"నేఁటిప్రపంచమున నాత్మావలంబనమున నమితదీక్షను జూపినత్యాగమూర్తుల పవిత్ర జీవిత చరిత్రములే మన స్వాతంత్ర్యమునకు, ధర్మమునకు, నభ్యుదయమునకు వినియోగపడు నట్టివిధమును శ్రీరామతీర్థస్వామి జీవితము స్పష్టపఱచుచున్నది. విదేశీయుల సంస్కారము లను ప్రవాహములో మునిఁగిపోవుచున్న భారతీయుల మగుమనకు మనసంస్కారములను మనధర్మములను, మనము స్వతంత్రతను గొని తెచ్చుకొనుపద్ధతిని దెలిపి రక్షించినమహానుభావులలో శ్రీరామతీర్థుఁడు చిరస్మరణీయుఁడు.

వివిధములగు జీవితరంగములలో విదేశీయుఁలభావముల కమ్ముడు
పోయినమనను స్వదేశీయభావములతో స్వాతంత్ర్యకాంక్షలతోఁ
దిరిగి మనస్థితికిఁ దెచ్చినయాతఁ డెంతపుణ్యుఁడో! ఆతనికిఁ
గలిమిలేములు, పట్టణారణ్యావాసములు, సుఖదుఃఖములు,
భూషణదూషణములు సమానములైనవి. ఈతఁడు స్వదేశము
నందును, విదేశమునందును బూరించిన స్వాతంత్ర్య శంఖా
రావ మీతని నిరుపమాన వేదాంతపరిజ్ఞానమును విశదము
చేయుచు నీతని పవిత్రజీవితమును బ్రత్యక్షము చేయు
చున్నది."

## రామతీర్థుని యాత్మసందేశము

"భారతాఖండస్వరూపము నే నేను. నాదేశమే నాశరీ
రము. కన్యాకుమార్యగ్రమే నా పాదభూమి. హిమాలయ
పర్వతమే నా తల. నా శిఖరమునుండియే గంగా, సింధు, బ్రహ్మ
పుత్రానదులు ప్రవహించుచున్నవి. వింధ్యపర్వతము నా కటి
ప్రదేశము. చోళమండలము మలబారు నా రెండు పాదము
లును. తూర్పు పడమర భాగములే నా చేతులు. నా చేతులు
చాఁచి నేను సర్వమానవకోటిని సంతోషముతోఁ గౌఁగిలించు
కొందును. నా ప్రేమ యంతట వ్యాపించినది. ఇది నాపైశరీ
రము. నేను నడచినచో నా దేశమే నడచినట్లుండును. నేను
మాటాడుచో నా దేశమే మాటాడుచున్నట్లుండును. నేనూపిరి
పీల్చుచో నా దేశమే పీల్చుచున్నట్లు తలంచెదను. నే నే
నా భారతదేశమను. నే నే శంకరుఁడను. నే నే శివుఁడను.

నే నున్నను బోయినను నీకముందుమాత్రము పల్లె పల్లెల వాడవాడల నింటింట వ్యాప్తమై దేశభక్తి, దైవభక్తి యెల్లరకు నడుబాటులో నుండును. నా వేదాంతమతమే ప్రకృతిశాస్త్రపద్ధతిని సత్యమని ధ్రువపడి ప్రపంచ మంత టను వ్యాపించు పుణ్యకాలము సమీపించుచున్నది. సందేహామే లేదు.”

## స్వదేశ సర్వదేశ సందేశము

‘ఓ ప్రియసోదరులారా! మీరు నీచముగా దేనిని జూడ కుఁడు. పంకమునుండి పద్మము పుట్టుట లేదా? ఏవస్తువు నైనను సరే మీరు నీచముగాఁ జూడ మొదలిడి రేని మీరు దానిని బ్రేమింపఁ జాలరు. ప్రేమించు టన సౌందర్యమును జూచుటే. సౌందర్య మన దైవమే. కావున, నన్నివస్తువులను బ్రేమించుటే మీరు నేర్చుకొనవలసిన మహావిషయము.’

‘ధన్యాత్ములగు నో భారతీయులారా! మీరు నికృ ష్టులు, నీచులు, పాపాత్ములు నని యెన్నఁడును దలంపకుఁడు. మిమ్ము మించిన మహాపురుషులు లేనే లేరని గర్వింపుఁడు. పరమేశ్వరుఁ డేపవిత్రభూమిపైఁ బుట్టి పెరుఁగ మనసుపడి యవతారములు తాల్చెనో యా పుణ్యభూమిని జన్మించిన మీకంటెను బుణ్యులేరి?’

‘ధనికనామక మహాదరిద్రులారా! మీ యింటినిండ బం గారమే యని మిడిసిపడకుఁడు. మీ బ్రదుకులు క్షణికములు. దరిద్రనారాయణులను, రైతుల నెడివిష్ణురూపములను మీ రాద

రింపుఁడు. బుద్ధిశాలురగు విద్యార్థులకు వలసినంత ధనము నొసఁగి మీరు వారి నవసరమున్న నితర దేశములకుఁ బంపుఁడు. వారచట వృత్తివిద్యలను జీవనావసరకళలను నేర్చుకొనివచ్చి, వేలకొలఁది భారతీయులకు భుక్తిమార్గము చూపఁగలరు.

"ఓభక్తులారా! మీరు వట్టి రామభజనచేసి మహాభక్తులమైతి మని విఱ్ఱవీఁగకుఁడు. సర్వప్రాణులయందును జాలి కలిగి, సర్వజీవరాసులయందును భగవంతుని మీరు చూడఁ గలిగిననాఁడే మీరు నిజమగుభక్తులు. భక్తియనఁగా సర్వమును ప్రేమించుటే; సర్వము దివ్యసౌందర్యరాశి యనియు నదియే స్వస్వరూప మనియు గ్రహించుటే."

"మహమ్మదీయసోదరులారా! మిమ్ము నే నెంతయుఁ బ్రేమించెదను. మీరు నన్నుఁ జంపినను సరే. మన మందఱ మొకతల్లిబిడ్డల మనియు మనలో మన మెన్నఁడును గలహింపరాదనియు, మనము కలిసి మెలసి యుండి పరస్పరము ప్రేమించుకొనియే బాగుపడవలయు ననియే మీకు నేను బోధించెదను. అట్లుకానినాఁ డెల్లరకు వినాశనమే ప్రాప్తించు నని నిశ్చయముగా నేను జెప్పఁగలను".

"సామ్రాజ్యాధిపతులారా! శాసనకర్తలారా! వివిధ జాతివ్యక్తులారా! మిమ్ము నేను దీవించెదను. మీ గౌరవములు, ఆగ్రహానుగ్రహములు, బెదరింపులు మీరే యుంచుకొనుఁడు. నాపైఁ జూప నక్కఱలేదు. సత్యమే నాసార్వభౌముఁడు. నాసత్య మనుచక్రవర్తికడ నితర చక్రవర్తులు,

రాజాధిరాజులు, మహాధికారులు, ధనసంపన్నులు, నందఱును బానిసలై వంగి సలాముచేసి దాసులై బ్రతుకవలసినదే."

"చిన్న, పెద్ద, హెచ్చు, తగ్గు, ఎక్కువ, తక్కువ-ఇవి ప్రేమరాజ్యములో లేనే లేవు. మరణము నిచ్చు కార్యమే యైనను ప్రేమతోఁ జేసినపుడది బ్రహ్మానందమునే యిచ్చును. స్వార్థపరత్వము- అనఁగా నేనే బాగుపడవలయును. నాకే యన్ని సుఖములు కలుగవలయును. ఒరుల కేమియు వలదు. అను భావము- రాజ్యపదవియందైనను నిత్యము బాధించు ముళ్ళకంపను గ్రుచ్చివైచును. దుఃఖములు మనలను ప్రేమింపుమని బోధించు మన పరమమిత్రములే."

"ఎల్ల ప్రాణికోటులహృదయములలోను నీహృదయము కొట్టుకొనకున్న నీవు మహాత్ముఁడవు కాఁజాలవు నామరూపముల వెనుక, పర్వతములగర్భమందు, నదీనదములగానమాధురులలో, మేఘములచాఁటున, నక్షత్రముల నవ్వులలో, అందమగు స్త్రీలవిలాసములలో, సమస్తజీవులలో, నెడతెగక ప్రవహించు ప్రేమామృతమును మనము కడుపారఁ గ్రోలఁ గలిగిననాఁడే మనము ధన్యాతిధన్యులము. లేనినాఁడు నికృష్టజీవులము. ఇదియే నేనొసఁగు స్వదేశ సర్వదేశసందేశము."

ఈ సందేశ మొక దేశమునకే కాక సర్వదేశములకును, ఒక మానవునకే కాక సర్వమానవులకును, ఒక పరిస్థితికే కాక సర్వపరిస్థితులకు నన్వయించును; అక్కఱకు వచ్చును; ఆదర్శమగును. ఈ మహోపదేశమును సర్వమానవకోటి యాదరించి యనంతమగు నానందమున విలసిల్లుకాలము సమీపించుఁగాక!

# రత్నత్రయము

## ౨

## వైజ్ఞానికరత్నము : రామనుపండితుఁడు

---

మన భారతదేశ మనాదినుండియు నెందఱో మహాను భావులకుఁ బుట్టినిల్లయి వారిమూలమునఁ దన గొప్పతనమును వెల్లడించుకొనుచునే యుండెను. అనాదియగు వేదకాలమునుండియు ననేకులగు ఋషిపుంగవులు కవితల్లజులు, శాస్త్రవేత్తలు, విజ్ఞానియోధులు, వీరమణులు లెక్కకు మిక్కిలిగా మనదేశమున వెలసియే యున్నారు. నడిమికాలమునమాత్రము దేశము పరరాజులపాలనలో నుండుటచేతను, నారాజులకు మన ధనధాన్యములను దోఁచుకొనుటలోఁగల యాతురతలో శతాంశమైనను మనవిజ్ఞానమును వైజ్ఞానికులను గౌరవించుటయందు లేకుండుటచేతను బహుసంఖ్యాకులగు పండితులు కవులు విజ్ఞానవేత్తలు రాజనీతి నిపుణులు నివురు గప్పిననిప్పువలె నుండిరే కాని యత్యధికముగఁ బ్రకాశింప నవకాశములే వారికి లేకపోయెను. నేఁడు పరిస్థితులు తాఱుమాఱయినవి. మనకు స్వరాజ్యము వచ్చినది. మాఱుమూలల మాటుమణఁగియున్న మహనీయులకుఁ దమతమ తెలువులు చూపి పేరు గడించుకొను నవ

కాశము లెన్నో లభించినవి. అప్పుడే రాజకీయముగ, నార్థిక ముగ, సాంఘికముగ, వైజ్ఞానికముగ దేశాభివృద్ధికరము లగు రాచ బాట లేర్పడినవి.

కాని, పరిస్థితు లెంత సంకుచితములుగ నున్నను బ్రకాశింపవలసినంతగాఁ బ్రకాశింపకపోయినను విజ్ఞానమణులు తమ దివ్యకాంతిపుంజములను బ్రకటించుచునే యుండును. ఆకాంతి పుంజములు చూపఱుల కనులకు మిఱుమిట్లు గొలుపుచునే యుండును. ఇందు సందేహము లేదు. దీని కుదాహరణమే మన వైజ్ఞానికమణి యగు చంద్రశేఖర వెంకటరామను జీవితము.

## జననము : బాల్యము

కొమ్మలలో రెమ్మలలో నాకులలోఁ జిగుళ్ళలో దాఁగి యుండినను సంపెంగపొదలో నొక్కసంపంగిపూవున్న దాని సౌరభము వ్యాపింపకుండ నెవరు నడ్డఁజాలరు. అగ్నికణ మున్నచో నది రగిలి రాఁజి జ్వాలయయి ప్రకాశించి తీరును. అట్లే పర రాజపాలన మనుచీకటిలో సైతము వైజ్ఞానికరత్నము లగు జగదీశచంద్రాదులు తమ ప్రతిభమూలమున దేశదేశము లందును ఖ్యాతిగాంచిరి. వారి తరువాత భౌతికశాస్త్ర ప్రపంచమున ధ్రువతారయై వెలుఁగొందిన మహనీయుఁడు డాక్టర్ సర్ చంద్రశేఖర వేంకటరామను ఎం. ఏ; డి. యస్. సి. (ఆనర్సు), యఫ్. ఆర్. ఏ. యస్.

ఈతఁడు పదునెనిమిదివందల యెనుబదియెనిమిదవ సంవత్సరము నవంబరు నెలలో నేడవనాఁడు దక్షిణభారతమునఁ బ్రసిద్ధి

గన్న తిరుచునాపల్లి నగరమున జన్మించెను. ఈతని తండ్రి పేరు చంద్రశేఖరయ్యరు. చంద్రశేఖరుఁ డున్నతవిద్య నభ్యసించి భౌతికశాస్త్రము నందును గణితశాస్త్రము నందును బ్రవీణుఁ డని పేరందెను.

ఆతఁ డపు డాంధ్రరాష్ట్రమునందలి ప్రధాన నగరములలో నొకటి యగు విశాఖపట్టణమున హిందూకళాశాలలో భౌతికశాస్త్ర గణిత శాస్త్రాధ్యాపక పదవి నిర్వహించుచుండెను. నాఁటి హిందూకళాశాలయే కాలక్రమమున నేఁటి మిసెస్. ఏ. వి. యన్. కళాశాలగా మారెను.

జన్మముచే నరవవాఁ డయ్యును వేంకటరామను బాల్యమును గొంత యౌవనకాలమును నాంధ్రరాష్ట్రముననే గడపి యాంధ్ర సంప్రదాయముల నెన్నిటినో యలవఱచుకొనెను. ఈతఁడు చిన్నతరగతులనుండి యనఁగా నక్షరాభ్యాసము మొదలుకొని 'యింటరు' పరీక్షదాఁక విశాఖపట్టణముననే విద్యాభ్యాసము చేసెను.

ఈతఁడు బాల్యమున బండపిల్లవాండ్రతోఁ దిరుగక విద్యయందు శ్రద్ధ, ఉపాధ్యాయులయందు గౌరవము, మంచి విషయమును దెలిసికొనుటయందుఁ గుతూహలము మిక్కుటముగాఁ గలిగియుండెను. కొంచెము శ్రద్ధగా నాతనిని గమనించువారి కాతనికి గొప్ప భవిష్యత్తు కల దని యాతని ముఖకళయే చెప్పక చెప్పుచుండెడిది. చిన్న విషయములయందును నాతఁడు బుద్ధికుశలతను బ్రదర్శించుచుఁ దోడిబాలురకుఁ దన యుపాధ్యాయులకుఁ బ్రియతముఁ డయ్యెను,

## వి ద్య

ఆఱవసంవత్సరము రాఁగానే వేంకటరామ నచటి మాధ్యమిక పాఠశాలలోఁ బ్రవేశించి పంద్రెండేండ్లు వచ్చు సరికే నాఁటి 'మెట్రిక్యులేషను' పరీక్షలోఁ గృతకృత్యుఁ డయ్యెను. ఆతఁడు తెలివిలోఁ దరగతి బాలుర కెల్లఁ బెద్దయి వయసులో నందఱికన్నఁ జిన్నయు నయ్యెను.

'మెట్రిక్యులేషను' పరీక్షలో నుత్తీర్ణుఁడైన వెంటనే యచటి కళాశాలలో నింటరు తరగతియందుఁ బ్రవేశించి వేంకటరామను కళాశాలావిద్య నేర్వ మొదలిడెను. ఈ కాల మున నే యాతఁ డింటియొద్దఁ దండ్రి సేకరించి యుంచుకొన్న విజ్ఞానశాస్త్రగ్రంథములఁ జదువుచు నందు మిక్కిలి యభి రుచి సంపాదించెను. అతఁడు రెండేండ్లలో 'నింటరు' పరీ క్షలోఁ గృతార్థుఁ డయ్యెను. వెంటనే తండ్రి యాతనిని జెన్నపట్టణము పంపి యచటి రాజధానీ కళాశాలలో (Presidency College) బి. ఏ; తరగతిలోఁ బ్రవేశ పెట్టెను.

సాధారణముగా జనులకు ధన మున్న విద్య యుంటదు. విద్య యుంటినవారికి ధనలోపముండును. ఈ రెండును గర్మము చాలక సమకూరినచోట బుద్ధిబలము కొఱవడును. ఇది లోక సామాన్యము. కాని, వేంకటరామ నదృష్టవంతుఁ డగుటచే నాతనికి బుద్ధిబలము, నర్థబలము, నంగబలము, నుత్సాహబలము నన్నియు లభించెను. ఇఁక, వలయున దేమి? ఆతఁడు చదు వులోఁ జరచర పోవుచుఁ బదునాలేండ్లు వచ్చుసరికే బి. ఏ.,

పరీక్షయం దు_త్తీర్ణుఁ డయ్యెను. సామాన్యముగ నుత్తీర్ణుఁ డగుట కాదు. ప్రథమశ్రేణిలో నుత్తీర్ణుఁ డయ్యెను. ఈతని బుద్ధిబలమునకు శ్రద్ధాభక్తులకు నుపాధ్యాయవర్గ మంతయు నీతనిని గొనియాడుచుండెడిది.

ఆ తరువాత, నాతఁ డాకళాశాలలోనే ఎం. ఏ., తరగతి యందుఁ బ్రవేశించెను. ఆతనితోడి విద్యార్థుల దొకదృష్టి; ఈతనిది వేఱొకదృష్టి. కళాశాలలోని శాస్త్రోపన్యాసకులు చెప్పిన విషయములతో నీతఁడు తృప్తిపొందక తనంతటఁ దానే పరిశోధనలు చేయుచు వానివానిఫలితములను బ్రామాణిక పాశ్చాత్య విజ్ఞానపత్రికలయందుఁ బ్రకటింపఁజొచ్చెను. ఈతఁడు పరిశోధనలోఁ బ్రకటించుచున్న యాసక్తికిని బ్రసరింపఁజేయుచున్న ధీశక్తికిని నాతని సహపాఠులు నుపాధ్యాయులు మిత్త్రవర్గము నీతఁడు వర్ధిష్ణువని యానాఁడే కనిపెట్టిరి. అట్లే యాతఁడు తన ఎం. ఏ. పరీక్షలో రాజధాని కంతకును బ్రప్రథముఁడుగా నుత్తీర్ణుఁ డయ్యెను. ఇంతకు నాతనికి నాఁటికిఁ బదునెనిమిదేండ్లే! ముక్కుపచ్చ లింకను నారని బాల్యావస్థయే!

## ప్రథ మో ద్యో గ ము

చదువు జ్ఞానముకొఱకనియే కాని యుద్యోగము కొఱకని రామను దలఁచి యుండలేదు. ఆతనికి విజ్ఞానపిపాస యధికమై యింక నెన్నో పరిశోధనలను జేయవలయు ననియు నెన్నో నూతనవిషయములను గనిపెట్టవలయు ననియు నొక లే

యుత్సాహము. కాని, యాతఁ డిఁకఁ జేయవలసిన పరిశోధన లకు మన దేశమున సౌకర్యములు బొత్తిగా లేకపోయెను. మన దేశము నాఁటికే స్వతంత్రమై యున్నచో నెన్నియో పరిశోధ నాలయములు (Laboratories) వెలసియే యుండెడివి. ప్రతి దేశము నుత్తమస్థితి నందుట కందు వైజ్ఞానికు లధికముగానుండి నిరంతర జిజ్ఞాసతోఁ బరిశ్రమించుచు ననేక నూతనవిషయములు కనిపెట్టుచుండఁగా నాపరిశోధనల ఫలితములను దేశమున నుపయోగించి యార్థికోపయోగము వైజ్ఞానికోపయోగము నందుచుండవలయును. ఇట్లే యన్ని దేశములు చేయును. కాని, మన దేశము పరదేశీయుల హస్తగతమగుటచే మన బాగును వారు చూడరైరి. "ఎద్దు పుండు కాకి కేమి!"

రామను తనకుఁ దగిన పరిశోధనాలయములు సౌకర్య ములు మన దేశమున లేనందున విదేశములకైనను వెడలి తన విజ్ఞానతృష్ణఁ దీర్చుకొన నెంచెను. కాని, యాతఁడు దేహదార్ఢ్య మంతగా నాఁటికి లేనివాఁ డగుటచేతను, శీతలప్రదేశములైన విదేశముల నారోగ్యముగఁ గడపుట కష్టమగుట చేతను నా యుద్యమమునుండి యాతఁడు విరమించెను. ఇఁక నాతఁ డేదే నొక యుద్యోగమునఁ బ్రవేశింపవలసి వచ్చెను.

ఆ కారణమున రామను భారతప్రభుత్వపరీక్ష కొకదాని కేఁగి యందు విజయము గాంచెను. అపుడు ప్రభుత్వము వా రాతని నార్థిక శాఖోద్యోగిగా నియమించిరి. అదియొక యున్న తోద్యోగము. Gezetted Post) ఇట్టి యుద్యోగమునకుఁ

ప్రయత్నించినవా రెందఱిలోనో యీతనికే యది లభించెను. ఇంత చిన్నవయసున నుద్యోగము లభించినవారు కాని, యందు నిట్టి యున్నతోద్యోగ మట్టి చిన్నవయసునఁ గన్న వారుకాని, నాఁటిభారతీయులలో నెవ్వరును లేకుండిరి.

ఇట్లు ౧౯౦౭ సంవత్సరము జూన్ నెలలో వేంకటరామను భారత ప్రభుత్వోద్యోగి యయ్యెను. నాఁటినుండి యాతఁడు కలకత్తానగరమునఁ బదేండ్లపాటియుద్యోగము నిర్వహించెను. కాని, యాతఁడతినైపుణ్యముతో నొకవంక నుద్యోగము చేయుచు నున్నతాధికారులమెప్పు పొందుచుండుటేకాక సెలవులలోను తీఱికవేళలందు నాతఁడు తన కత్యంతప్రియకరమైన పరిశోధనలను గొనసాగించుచునే యుండెను. ఇది సాధ్యపడుటకుఁ గారణము కలకత్తాలోనే మహేంద్రలాలు సర్కారు స్థాపించిన భారతీయ భౌతిక విజ్ఞాన కృషిసంఘము ( Indian Association for the Cultivation of Sciences) నకుఁ గల పరిశోధనాలయ మొకటి యాతని కందుబాటులో నుండుటయే.

ఇట్లతఁ డొకవంక నుద్యోగము మఱియొకవంకఁ బరిశోధనలు చేసి యీ పరిశోధనాఫలితములను 'Nature', 'Physical Review' మున్నగు పాశ్చాత్యవిజ్ఞానపత్రికలకుఁ బంపి ప్రకటించుటచే నీతని యున్నతోద్యోగు లీతని యుద్యోగనిర్వహణసామర్థ్యమునకుఁ, బ్రపంచవైజ్ఞానికు లీతని యనన్యసామాన్యపరిశోధనలకును, జాల మెచ్చుకొనుచుండిరి. ఈ మెప్పు ఫలితముగా నాతఁడు ప్రతిసంవత్సరము నఖిలభారత

వైజ్ఞానికపరిషత్తు (The All India Science Congress) న కాహ్వానింపఁబడు చుండు విఖ్యాతపరిశోధనాపత్త్రములను జదివి వైజ్ఞానికులతోఁ బరిచయము సంపాదించుకొనెను. దానివలన నాతని బుద్ధిబలము వృద్ధిపొందెను. ఆతని కీర్తిచంద్రి కలుకూడ వ్యాపింపసాగెను. ఇంతింత గొప్పపరిశోధనల నేమాత్రము తీఱికయే యుండని యట్టియుద్యోగములో నుండియు నీతఁ డెట్లు కొనసాగించె ననియే యాతనినిగుఱించి యెల్ల రాశ్చర్య పడుచుండిరి.

## భౌతికశాస్త్రాచార్యపదవి

ఆ తరువాత వేంకటరామను ఆర్థికశాఖోద్యోగమునుండి తంతి తపాలా శాఖయందు ఉపగణక శిఖామణి (Deputy Accountant General) పదవికిమాఱెను. ఆదినములలోనే కలకత్తా విశ్వవిద్యాలయమున నొక వైజ్ఞానిక కళాశాల నెల కొల్పవలయు నని తారకనాథుఁడు రసవిహారిఘోషు మున్నగు వారు చేసినకృషి ఫలించెను. అప్పు డావిశ్వవిద్యాలయోపాధ్యక్షుఁడు (Vice-Chancellor) సుప్రసిద్ధుఁ డగు ఆషుతోషుముఖర్జి. వీరెల్లరు నూహించి భారతీయభౌతిక శాస్త్రవేత్తనే భౌతికశాస్త్రాచార్యపదవి (Palit Professor of Physics) కాహ్వానింపవలయు నని నిశ్చయించుకొనిరి.

ఆ నిశ్చయము ననుసరించి రామనుపండితుని నాపదవి నధిష్ఠింపవలసిన దని ఆషుతోషుముఖర్జి కోరెను. వెంటనే రామను దాని కంగీకరించెను. తన కభిమాన విషయమైన

పరిశోధన కిందవకాశము లధికము లగుట, తానున్న పదవి కంటె భౌతికశాస్త్రాచార్యపదవి హోదానుబట్టియు జీతమును బట్టియుఁదక్కువదే యైనను నాతఁడు ౧౯౧౭ వ సంవత్సరమునఁ గలకత్తావిశ్వవిద్యాలయ భౌతికశాస్త్రాచార్య పదవి నలంకరించెను.

ఈవిధముగా రామను పండితుఁడు ప్రభుత్వసేవకత్వమునుండి విజ్ఞానసేవకత్వమునకు దానిమూలమున స్వదేశ సర్వదేశ సేవకత్వమునకు గొప్పనిదర్శనమాయెను.

## విజ్ఞాన పత్త్రికాస్థాపనము

ఎడ తెగక చేయుకృషి, మొక్కవోని శేముషి, యరమరిక లేని యాసక్తి-ఇవి రామను పండితు నొక వైజ్ఞానికునే కాక యొక విజ్ఞానసర్వస్వము నొనరించినవి. అంతే కాదు. ఆతఁడున్న చోటనే యుండి యాతనికి సపర్యలొనరించి శాస్త్రపరిశోధనల నొనరింపవలయు ననియే భౌతిక శాస్త్రవిద్యార్థి ప్రపంచ మువ్విళులూరుచుండెడిది. దాని కాతఁడున్న స్థానము నాతనికిఁ గల యుత్సాహము దోహదము లొసఁగినవి. అందుచే నెందఱో విద్యార్థులు దేశము నలుగడలనుండి వచ్చి యాతని యాధ్వర్యవమునఁ బరిశోధనలు చేసి, వాని వాని ఫలితములను వ్రాసియుంచుకొనుచుండిరి. వీని నన్నిటిని గలిపి యెప్పటి కప్పుడు ప్రకటించుచుండిననే కాని నలువురకుఁ దెలియుటయు దానిమంచి చెడ్డలపై విమర్శలు బయలు దేఱుటయు

జరగదు. శాస్త్రాభివృద్ధి కిట్టి ప్రచురణము లెంతయో యవసరమైనను నాంటికి దేశమున భౌతిక విజ్ఞాన పత్రికయే కఱవాయెను. ఈ లోపముం దీర్ప రామ నూహించుచుండెను.

ఇంతలో రామను కీర్తిచంద్రికలు మిన్నుమిట్టుచుండుటచే నాతఁడు కలకత్తాయందలి భారతీయ భౌతికవిజ్ఞానకృషి సంఘమునకు గౌరవకార్యదర్శిగా నేకగ్రీవముగ నెన్నుకొనంబడెను. ఈయదనున రామ నాసంఘము పక్షమునం జిన్న సంచికల (Bulletins) రూపమున నాయాయా విజ్ఞాన పరిశోధనముల ఫలితములను దొలుదొలుతం బ్రకటింపం గడంగెను. కాని, యీపద్ధతి యంతతృప్తికరముగా లేనికారణమున 'భారతీయభౌతిక శాస్త్రాభివృద్ధి కృషిసంఘ నివేదిక' యను పేర నొకవిజ్ఞానపత్రిక నారంభించి యందుం దనవియుం దనశిష్యులవియు నగుపరిశోధనముల ఫలితములను బ్రకటించుచు విజ్ఞానప్రపంచమునకు సుజ్ఞాన భిక్ష నొసంగెను. కాలక్రమమున నీపత్రికయే భారతీయభౌతిక విజ్ఞానపత్రిక (Indian Journal of Physics) యను పేరు విశ్వవిఖ్యాతి నార్జించుచున్నది.

## దిగ్విజయయాత్రలు

మహాపురుషులకీర్తిచంద్రిక నొకగ్రామమునుగానియొక దేశమును గాని యంటిపెట్టుకొని యుండవు. వానికి నదులు, సముద్రములు, పర్వతములు, దూర భారములు నడ్డురాంజాలవు. అవి విశాలప్రపంచము నంతటి నావరించితీరును. అట్లే రామను పండితునికీర్తి యప్పటి కప్పుడే ప్రపంచమున వ్యాప్తిగాంచెను,

౧౯౨౧ వ సంవత్సరమున జరిగిన యాంగ్లసామ్రాజ్యాంతర్గత విశ్వవిద్యాలయమహాసభకు భారతదేశపక్షమున నాఁత డేకగ్రీవముగఁ బ్రతినిధిగా నెన్నికయ్యెను. ఈసభ 'ఆక్సుఫర్డు' లో జరగెను. దాని కోడపైఁ బోవుచునే రామను మధ్యధరా సముద్రవిచిత్రనీలపరిరేఖ (Wonderful blue opalescence of the Mediterranean Sea) కాశ్చర్యమందెను. దాని పుట్టువునకుఁ బూర్వోత్తరముల నెఱుఁగు విజ్ఞానశక్తి యాతనికిఁ గలిగెను. వెంటనే యావిజ్ఞానరహస్యముగుట్టు బయలుపెట్టఁ బరిశోధన మారంభించి యాతఁడు సునిశితమేధాశక్తితో— సముద్రపు నీటిలోఁ గలయనంతము లగు నణువులు నీటిలోఁ బ్రవేశించుచుండు సూర్యకిరణముల కాంతిపుంజమును బరిక్షేపించుటచే దాని కానీలపరిరేఖ సిద్ధించినదని - లోకమునకుఁ జాటెను.

దీనితో స్వదేశముననే ప్రకాశించుచు విదేశములలో మినుకు మినుకను నీతనికీర్తిదీప మటఁగూడఁ బ్రకాశింప మొదలిడెను. నాఁటిసభలో నాఁత డొసఁగినవిజ్ఞానగర్భితోపన్యాసమెల్లరిమన్ననల నందఁగనెను. అచటఁ జేరినవిఖ్యాతాంగ్లపరిశోధకులెందఱో యీతనిపరిచయమున కానందించిరి. రామనుపండితునకుఁ బేరెన్నికగన్న వైజ్ఞానికులసుపరిచితి యేర్పడెను.

ఇటు లాంగ్లదేశమునఁ గీర్తిశాలియై భారతదేశమునకు వచ్చినతరువాత రామనుపండితున కొకయాహ్వానము వచ్చెను. అది కెనడాదేశమున విజ్ఞానాభివృద్ధికై పర్యటింపఁ దలఁచిన యాంగ్లశాస్త్రవేత్తల సంఘమునుండి.

ఈ విజ్ఞానయాత్రకుఁ దలవనితలంపుగా వచ్చిన యవకాశమునకు రామనుపండితుఁ డానందించి యంగీకరించి కెనడా దేశమున నాంగ్లశాస్త్రజ్ఞులతోఁ బర్యటించి యనేకవిజ్ఞాన విషయములఁ గూర్చి యనేక ప్రదేశములలో నుపన్యసించెను.

ఇంతలో నాతనికి 'ఫిలడల్ ఫియా' లో జరగఁబోవు 'ఫ్రాంక్లిన్' సంఘ శతవార్షికోత్సవ సందర్భమున భారతదేశమున కేకైక ప్రతినిధిగా విచ్చేసి పాల్గొన నాహ్వానము వచ్చెను. దానికిని నాతఁ డంగీకరించి యా యుత్సవములలోఁ బాలుగొని పేరెన్నికగాంచెను. అచటనే రామనుపండితున కమెరికా వైజ్ఞానిక శిరోమణి యనఁదగు రాబర్టు మిల్లికను దొరతోఁ బరిచయము నాతని యభిమాన గౌరవములను జూఱగొను నవకాశము లభించెను.

ఆ సంవత్సరముననే (౧౯౨౪) లండనులోని 'రాయలు సొసైటీ' వారు రామనును దమ సంఘగౌరవసభ్యునిగాఁ జేర్చుకొని గౌరవించిరి.

రామనునకు మిల్లికనుదొరతోఁ గలిగిన పరిచితి మూలముననే కాలిఫోర్నియాలోని పారిశ్రామిక విద్యాసంస్థ (Institute of Technology) లో నపుడపుడు వచ్చి యుపన్యసించు నాచార్యపదవి (Visiting Professor) లభింపదాని నాతఁడు నాలుగు మాసములు నిర్వహించి ౧౯౨౫ సంవత్సరము మార్చి నెలలో మన దేశమునకుఁ దిరిగివచ్చెను.

మన దేశమునకు వచ్చి మరల నూతనపరిశోధనలఁ జేయుచునుండఁగా ననతికాలముననే యాతనికి రష్యాదేశమున

లెనిన్‌గ్రాడు, మాస్కోనగరములలో జరుగుచున్న రష్యావైజ్ఞానికసమితి ద్విశతవార్షికోత్సవములోఁ బాలుగొనరమ్మని యాహ్వానము వచ్చెను. అపుడు రామను ఆ సమావేశముల కేఁగి యెన్నియో యుపన్యాసములమూలమునఁ దనప్రతిభ నే కాక భారతీయ ప్రతిభను రష్యాకే కాక జగత్తున కెఱుక పఱచి తిరిగి వచ్చుచు యూరపుఖండపర్యటన మొనరించి వివిధ విజ్ఞాన కేంద్రములను, వివిధ పరిశోధనాలయములను, వివిధ వైజ్ఞానిక శిరోమణులను దర్శించి నూతనానుభవములను సంపాదించి తిరిగి కలకత్తా విచ్చేసి మఱల యథాప్రకారముగాఁ బరిశోధనల నిర్వహింపఁజొచ్చెను.

## రామను సిద్ధాంతము

(Raman effect)

ఇంగ్లీషు ౧౯౨౮వ సంవత్సరమున రామనుపండితుఁ డొక మహోన్నతమైన పరిశోధనమును జేసి యొక నూతన పరిక్షేపణఁ (New Radiation) గనుఁగొనెను. ఇదియే రామను సిద్ధాంత (Raman Effect) మను పేర విశ్వవిఖ్యాతి నార్జించెను. దీనిసార మిది : ఒకే రంగుగల కిరణము కాంతిని బ్రసరింపఁజేయు దారి–పారదర్శకయానద్వారము–నుండి ప్రవహించునపుడు పరిక్షేపించును. ఈ పరిక్షేపించిన కిరణము మొదటికిరణమునకుఁగల రంగును గాంచక యొక క్రొత్త రంగునకు మార్పుచెందును. ఈ విధముగా మార్పు చెందినరంగెల్లకాలము నొకేవిధముగా నుండక పారదర్శకయానము పై నే నాధారపడి హెచ్చుచుఁ దగ్గుచు నుండును.

తేజశ్శాస్త్రమున నీ పరిశోధనకుఁ గలిగిన విశిష్టత యత్యంతము. ఈ పరిశోధనవలననే రామనుకీర్తి ప్రతిష్ఠలు ప్రపంచమంతను సుప్రతిష్ఠితము లయ్యెను. ఇంతటి మహోన్నత పరిశోధనమును జేసినది రామను పండితుఁడు కోట్లకొలఁది ధనము వెచ్చించి పరికరముల సమకూర్చుకొన్న పాశ్చాత్య విజ్ఞాన కేంద్రములలోఁ గాదు. సామాన్యపరికరముల కైనను నోచుకొనని దాస్యశృంఖలాబద్ధ మగు భారతదేశమున నే. మఱియు సర్వజనులకు లభించుచు సృష్ట్యాదినుండి ప్రాఁగుచున్న సూర్యకిరణముల సాహాయ్యముననే యీతఁడీ పరిశోధనమును జేసియుండుట విశేషములకెల్ల విశేషము.

ఈ పరిశోధనమునకు సంతసించియే ౧౯౨౮ లో ఇటాలియను వైజ్ఞానిక సమితివారు 'మెట్లూసీ' పతకము నిచ్చి రామనుపండితు నత్యంతముగా గౌరవించిరి. ఇది మొదలు రామనుపండితునకుఁ గలుగుచు వచ్చుచున్న బహూకృతులు సత్కారములు తామరతంపరలై లెక్కకు మిక్కిలి కాఁజొచ్చెను.

## నోబెలు బహూకృతి

ఇటు లుండ, ౧౯౨౯ వ సంవత్సరములో నమెరివా సంయుక్తరాష్ట్రములఁ గల 'ఫేరడే' సమితి వారణువర్ణపట్టిక (Molecular Spectra) ను గుఱించి సమగ్రముగఁ జర్చించుటకు విశ్వవైజ్ఞానికుల నెల్లర నాహ్వానించుచు మన రామను పండితునిగూడఁ బిలిచిరి. గాము నంగీకరించి యీ దేశ

మేఁగి యనేక వైజ్ఞానిక విషయములను దెలిపి తిరిగివచ్చుచు యూరపుఖండమందలి వివిధవిజ్ఞాన కేంద్రములను బహుసంఖ్యా కులగు విజ్ఞానులను మరలఁజూచి వారివారి యాదరగౌరవము లకుఁ బాత్రుఁ డయ్యెను.

ఆ సంవత్సరముననే భారత ప్రభుత్వము రామను ఘన తను గ్రహించి యానందసూచకముగా నాతనికి "సర్" బిరుదము నిచ్చి తన్నుఁ దాను గౌరవించుకొనెను. అపుడు భారత దేశ వైజ్ఞానిక మహాసభ చెన్నపురిలో జరగనుండెను. దానికి రామనుపండితు నేకగ్రీవముగా భారతవైజ్ఞానికు లెల్లరు నధ్యక్షునిగా నెన్నుకొనిరి.

౧౯30 వ సంవత్సరములో రామనుపండితుని సగౌర వముగా నాహ్వానించి లండనులోని రాజసమితి (Royal Society) వారు 'హ్యూస్' పతకము నిచ్చి నిరుపమాన మగు గౌరవము నీతనిపైఁ జూపిరి.

వినయసంపద యుండి విద్యావిషయమున శ్రద్ధ పట్టు దల గలిగి విజ్ఞానమే జీవితపరమావధిగా నెంచి యొక్క నిముసమైనను వ్యర్థముగాఁ గాలక్షేపము చేసి యెఱుఁగని యేవ్యక్తికైనను నేదేశమునకైనను నెంతెంత గౌరవము లైనను లభింపక మాన వనుటకు మనకు రామను పండితుఁడే పెద్దయుదాహరణము. ఆతనికి లభించిన గౌరవములు నాతఁ డందిన సత్కారములు నెన్ని యొకపట్టిక నీయఁ దలఁచుచో నది యొక పెద్ద గ్రంథమంత యగును.

సాధారణముగా నెవ్వరు నందఁజాలని యీపై గౌరవముఁ లేకాక రామనుపండితునకు విశ్వవిఖ్యాతమైన గౌరవమొకటి ౧౯౩౦ వ సంవత్సరమున జరిగెను. ప్రపంచమంతటిలోను నేరంగమందైనను సర్వోత్తమముగు పనిచేసిన యొక విజ్ఞానవేత్తకుఁ గాని రాజనీతినిపుణునకుఁగాని కవిపండితునకుఁగాని యేఁటేఁట నొక్కొక్కనికి బహూకృతి యొకటి యిచ్చుటకు "ఆల్ఫ్రెడ్ నోబెల్" అను స్వీడిషు దేశ పారిశ్రామికవేత్త తనపేర నొకనిధి నేర్పాటుచేసెను. దీనినిబట్టి "నోబెలు బహూకృతి" గతించిన యేఁబది సంవత్సరముల నుండి పరిపాటియయ్యెను. ఆ సంవత్సరము ప్రపంచవైజ్ఞానికులందఱును జేరి యీయేటి బహూకృతికి రామనుపండితునకు మించిన యర్హుఁడు లేఁడని యేకగ్రీవముగా నిర్ణయించిరి. ఈ నిర్ణయమువలన రామనుపండితునకు నాతనిమూలమున భారతదేశమునకుఁ బ్రపంచమున నొక మహోన్నత గౌరవము లభించెననుటలో సందేహము లేదు.

రామనుపండితుఁడు ౧౯౩౦ వ సంవత్సరము నవంబరు నెలలో నోబెలుబహూకృతిని స్వీకరించుటకొఱకై స్వీడను దేశమందలి స్టాకుహోము నగరమునకుఁ బయన మయ్యెను. అతఁడా నగరమున కేఁగి మహాగౌరవము లంది పిమ్మట డిసెంబరు పదియవనాఁడు జగత్ప్రసిద్ధ మగు "నోబెలు" బహుమతిని గైకొని యామఱునాఁడు నోబెలు మహోపన్యాస మొసఁగి వైజ్ఞానిక జగదాకాశమునఁ దేజోరాశియగు ధ్రువ తారయై

వెలుఁగొందెను. ఈ ధ్రువతారవలననే భారతదేశమునకుఁ బ్రపంచ విజ్ఞానాకాశమునఁ జంద్రపదవియే లభించెను.

ఒకవ్యక్తి సునిశితమేధాశక్తివలన, నొక్కవ్యక్తి నిరుపమాన విజ్ఞానవిశేషమువలన, నా వ్యక్తికే కాక యాతని కుటుంబమునకే కాక యాతని గ్రామమునకే కాక యాతని రాష్ట్రమునకే కాక యాతని దేశమునకు సభ్యజగత్తున నెంతెంత గౌరవము లభించునో మన మీతని చరిత్రవలన గ్రహింపవలసియున్నది. ప్రతివిద్యార్థియు రామనుపండితునకున్న యుత్సాహము, నాదర్శము, దీక్ష, శ్రద్ధాభక్తులు, నిరంతర కార్యదీక్షాశూరత, నలవఱచుకొని విఖ్యాతినార్జింపవలయునని యెంచవలయును. అవి లేక "గ్రుడ్డియెద్దు చేనఁ బడినట్లు" చదివిన చదువువలనఁ "బుట్టలోని చెదలు పుట్టవా గిట్టవా" యన్న వేమనసూక్తియే మన కన్వయించును.

## ఇతర గౌరవములు

నోబెలు బహుమానాకృతి స్వీకరించిన తరువాత రామను పండితుఁడు మన దేశమునకుఁ దిరిగివచ్చుచు మరల యూరపు ఖండమందలి వివిధ విజ్ఞానకేంద్రములను దర్శించెను. ఆతనికిఁ బ్రతి కేంద్రమునందును వర్ణింప నలవికానిరీతి నెన్నెన్ని గౌరవ మర్యాదలో లభించెను.

ఆతఁడు స్వదేశమునకుఁ దిరిగివచ్చి తనపని తాను జేసికొనుచుండఁగా ౧౯౩౨వ సంవత్సరమున నాతనిని 'పారిసు' విశ్వవిద్యాలయమువారు పిలిచి గౌరవించి గౌరవడాక్టరేటు పట్టము నిచ్చి వీడ్కొలిపిరి.

ఇదిగాక రామనుపండితుని గౌరవించిన విశ్వవిద్యాలయములు నాతనికిచ్చిన గౌరవబిరుదములు లెక్కకు మిక్కిలియైనవి. కలకత్తా, కాశీ, డక్కా, మదరాసు, ఆంధ్ర విశ్వవిద్యాలయములు మన దేశమునను; పారిస్, గ్లాస్గో, ఫ్రీబర్గు, లండను మున్నగు విదేశ విశ్వవిద్యాలయములు రామనుపండితునిపై గౌరవపట్టవర్షమును గురిపించి తమ కట్టియవకాశము నదృష్టము కలిగినందులకు మురిసిపోయి యానందమున మిన్నుముట్టినవి.

ఇఁక, సీతనిని గౌరవసభ్యునిగఁ జేర్చుకొన్న సంస్థల పట్టిక నిచ్చుట సాధ్యము కానిపని. భారతీయ రసాయన శాస్త్రసంఘము, గణితశాస్త్రిసమితి, అఖిలభారత వైజ్ఞానిక సమితి మున్నగు సంస్థ లెన్నియో యాపని చేసినవి. ఆంధ్ర విశ్వవిద్యాలయము, కాశీవిశ్వవిద్యాలయము తమ విద్యాలయములలో సీతనిని గౌరవ భౌతిక శాస్త్రాచార్యునిగా నియమించుకొని గర్వించినవి.

రామనుపండితుఁడు మరల ౧౯౩౭ వ సంవత్సరమున నంతర్జాతీయభౌతిక శాస్త్రిమహాసభలోనుపన్యసించుటకు భారతదేశప్రతినిధిగా 'బోలోన్' 'పారిస్' నగరముల కేఁగి యుపన్యసించియితోధికకీర్తి ప్రతిష్ఠలతో మన దేశమునకుఁదిరిగివచ్చెను.

తరువాత ౧౯౪౧ వ సంవత్సరమున నమెరికాసంయుక్త రాష్ట్రవిజ్ఞానసమితి రామనుపండితునకు 'ఫ్రాన్క్లిన్'. పతకము నిచ్చి మరలసన్మానించెను. అనంతరము, చైనావైజ్ఞానిక సమితి రామనుపండితుని గౌరవసభ్యునిగాఁ జేర్చుకొనెను. మఱియు

నొందఁగో రామనుపండితున కనేకగౌరవస్థానములనిచ్చి వివిధ సత్కారముల నొనర్చియాతనియసమాన శేముషినిగుర్తించిరి.

## భారత విజ్ఞాన సంస్థ

(Indian Institute of Science)

పరప్రభుత్వము పాలించుచున్నను భారతదేశమునఁ బదార్థవిజ్ఞాన పరిశోధన లటనట జరుగుచు వచ్చినను, జెప్పఁ కొనఁ దగిన బరిశోధనల కెల్ల కలకత్తానగరమే ముఖ్య కేంద్రమై యుండెడిది. దానికిఁ బ్రధానకధానాయకుఁడు రామనుపండితుఁడే యై యుండెను.

కాని, ౧౯33 వ సంవత్సరము భారత వైజ్ఞానిక చరిత్రలో సువర్ణాక్షరములతో లిఖింపఁ దగినసంవత్సరము. ఆయేఁడే మన దేశమందలి పారిశ్రామిక సంస్థలలో నగ్రేసర మనఁ దగిన తాతాకంపెనీ యొక గొప్పవిరాళము నొసఁగుటయు దాని సక్రమవినియోగమునకు భారతమైసూరుప్రభుత్వముల సంయుక్తయాజమాన్యమున బెంగుళూరులో నొక భారత విజ్ఞానసంస్థ (Indian Institute of Science) నెలకొను టయు జరిగెను. అంతేకాదు; ఆ సంస్థకు మొట్టమొదటి పదార్థవిజ్ఞానశాస్త్రాచార్యుఁడుగా రామనుపండితుఁడు నియమితుఁడగుటయే యింతకన్న నెక్కువవిశేషము. దీనితోఁ దక్షిణభారతమున నొకప్రశస్తమగు విజ్ఞానపరిశోధన కేంద్ర మేర్పడి మనకు మిక్కుటమగు మేలు చేకూర్చెను.

రామనుపండితుఁడు కలకత్తా విశ్వవిద్యాలయమును, భారతీయ విజ్ఞానకృషిసంఘమును, విడువలేక విడిచి బెంగు

భూరు చేరుటతో నుత్తరమున నారంభమైన విజ్ఞానజ్యోతి దక్షిణమునఁ బ్రకాశింపఁజొచ్చెను.

బెంగుళూరులో నుండి రామనుపండితుఁడు చేసిన పరిశోధనలలో నద్వితీయ మని పేరెన్నికగన్న దాతని స్ఫటిక నిర్మాణపరిశోధనము. ఆ పరిశోధనల ఫలితముగా నాతఁడు ప్రకటించిన ఘనపదార్థస్థితి సూత్రము (Raman's Theory of Solid state) మిక్కిలి పేరెన్నిక గాంచినది. అది యీం వఱలో నాతనికి విశ్వవిఖ్యాతి నార్జించిపెట్టిన "Raman effect" తోఁ దుల్యమైనదని పెక్కురువిజ్ఞులు వక్కాణించిరి.

## భారతీయ విజ్ఞాన పరిషత్తు

## (Indian Academy of Sciences)

ఇట్లు రామనుపండితుఁడు బహుపరిశోధనలు తాను జేయుచు విద్యార్థులచేఁ జేయించుచునే భారతీయ విజ్ఞానపరిషత్తు (Indian Academy of Sciences) ను స్థాపించెను. ఈవిజ్ఞానపరిషత్సమావేశము సంవత్సరమున కొకసారి యొక విశ్వవిద్యాలయకేంద్రమున జరుగును. ఆ సమావేశములందు వివిధపరిశోధకులు చేసిన వైజ్ఞానిక పరిశోధనములను గుఱించి శాస్త్రవేత్తలు చర్చించుటయే కాక యీయానూతన పరిశోధనలు భారతదేశాభివృద్ధి కెట్లు వినియోగపడు నన్న విషయములు కూడ నట సంపూర్ణముగాఁ జర్చించు నేర్పాటు జరిగెను. ఈ పరిషత్తున కనుబంధముగా భారతీయ వైజ్ఞానికుల పరిశోధనాఫలితముల నెప్పటికప్పుడు ప్రపంచమునకు వెల్లడించుటకుఁ దా నిదివఱలోను కలకత్తాలో స్థాపించిన

విజ్ఞానపత్రిక యొక్కటే చాల దని యెంచి భారతీయ విజ్ఞానపరిషత్సభాని వేదిక 'Proceedings of the Indian Academy of Sciences అను పేర నొకటియు "వర్తమాన విజ్ఞానము" (Current Science) అను పేర నొకపత్రికయు నిట నాతఁడు స్థాపించెను.

చిరకాల మిట్లు రామనుపండితుఁడు భారతీయవిజ్ఞాన పరిషత్తున నుండి, ౧౯౩౯ వసంవత్సరమునుండియు బెంగుళూరు లోనే "రామనుపరిశోధనాసంస్థ" యను పేర సొంతముగా నొక సంస్థనుస్థాపించి,యక్కడ నెన్నో పరిశోధనలు చేయ మొదలిడెను.

ఇట్లుండఁగా రెండవ ప్రపంచయుద్ధము సంభవించెను. ఏవిధమైనవిజ్ఞాన మైనను వృద్ధిపొందవలయు నన్న దేశమునఁ బ్రశాంతపరిస్థితు లుండితీరవలయును. యుద్ధభీతినున్న దేశములు యుద్ధములో నిమగ్నమైన దేశములు కూడ యుద్ధపరిశ్రమ లందే యెక్కునశ్రద్ధ వహించి మిగిలిన విజ్ఞానవిషయములలో నేమియు నుత్సాహ మీయకపోవుట సహజము. ఈ యుద్ధ మేఘములు ప్రపంచము నావరించి యున్నంతకాలము ప్రశాంతముగాఁ బరిశోధనలు జరుగ నేరవు. ఇదియే మన దేశమున సంభవించినది.

## ప్రప్రథమ జాతీయపరిశోధనాచార్యపదవి

దైవవశమున రెండవప్రపంచయుద్ధము సమాప్త మగుటయు ౧౯౪౭ ఆగష్టు ౧౫ వ నాఁడు భారతదేశమునకు స్వాతంత్రత లభించుటయు జరిగెను. బ్రహ్మాండమగు నీ పరిణామము వలన భారతదేశమున నన్నిరంగములలోను నవజవజీవములు

పొడకట్టెను. భారతవిజ్ఞాన చరిత్రలోనైతమీమార్పు మిక్కిలి గణనీయ మయ్యెను. నూతన జాతీయప్రభుత్వము భారతదేశ క్షేమమును సహస్రముఖములఁ గాంక్షించి మనకు సహజముగా లభించు ప్రకృతిసంపదల నన్నిటిని సద్వినియోగపఱచుకొన వలయు ననియు, నందునిమిత్తము విజ్ఞానాభివృద్ధి కున్నత మగు దోహదము నొసఁగవలయు ననియు, నెంచి కార్యశూరత చూపఁ దొడఁగెను.

భారతజాతీయప్రభుత్వము విజ్ఞానాభివృద్ధి విషయమునఁ జేసిన మహోన్నత కార్యములలో మొట్టమొదటిది భారత ప్రభుత్వపరిపాలనశాఖలోఁ ప్రత్యేకించి యొక విజ్ఞానపరిశోధక శాఖ నేర్పఱుచుటయే. ఈ శాఖ యేర్పడుటే గొప్ప విశేషము. దాని నభ్యుదయగామి, విజ్ఞానశిఖామణి, విశాలహృదయుఁడు, వివేకవంతుఁడు, ప్రధానమంత్రి యగు నెహ్రూ పండితుఁడే చేపట్టుట విశేషముల కెల్ల విశేషము.

అటుపిమ్మటఁ జిరకాలమునుండి వైజ్ఞానిక ప్రపంచమున రామను పండితునకుఁ గలయున్నత గౌరవమునుబట్టియు నాతని బుద్ధివికాసము, పరిశోధనాచాతుర్యము, మొక్కవోనియుత్సాహము, నిరంతర కార్యశూరత, స్వదేశ విజ్ఞానాభివృద్ధికాంక్ష వీని నన్నిటిని బట్టియు నాతఁడు భారతదేశమున కొనగూర్చిన మహాసేవ, కొనితెచ్చిన యద్వితీయగౌరవము- వీనికిఁ గృతజ్ఞతాపూర్వకముగను, భారతజాతీయప్రభుత్వము రామను పండితునే ప్రప్రథమ జాతీయపరిశోధనాచార్యునిగా నియమించు భాగ్యము నందఁగన్నది.

౧౯౫౦ సంవత్సరము జనవరి నెలలో నాఁటి మనయుప ప్రధాని ఢిల్లీనగరమున నావిష్కరించిన 'భారతజాతీయ పదార్థవిజ్ఞాన పరిశోధనాగారము' (The National Laboratory) జగత్ప్రసిద్ధమైనదగుటయు దానికి రామనుపండితుని సాహాయ్య సంపత్తియు సౌహార్దభాగ్యమును గలుగుటయుఁ గూడ భారతదేశభాగ్యమని చెప్పక తప్పదు.

ఇట్లు రామనుపండితుఁడు దినదినము నున్నత గౌరవములను మహోన్నతపదవులను నందుచుండియు భారతదేశ సౌభాగ్యమే పరమాశయముగాఁ బెట్టుకొని పరిశోధనల సాగించుచు నాయురారోగ్యభాగ్యములతో జీవించియుండుట భారతీయుల పుగు మన మహాభాగ్యము.

## ఇతర పరిశోధనలు

రామనుపండితుఁడే చేసిన యితరపరిశోధనము లెన్నో యున్నవి. అం దాతఁడు ఎం. ఏ; చదువుచుండఁగనే శబ్ద శాస్త్రమందు "మల్డే" యను వైజ్ఞానికుఁడు చేసిన ప్రయోగమునకు నూతనావకాశము సూచించుట యొకటి. ఇదియే రామనుపండితునకుఁ దొలుదొలుతఁ జెన్నపురి విశ్వవిద్యాలయమువారి స్వర్ణపతక బహూకృతిని సంపాదించి పెట్టినది. తరువాత నీతఁడు ప్రాచ్య పాశ్చాత్య సంగీత వాద్యవిషయములఁ జేసినపరిశోధన శబ్దశాస్త్ర పరిశోధనలో నీతని కొక విశిష్టస్థానమును సంపాదించి యిచ్చినది. పాశ్చాత్య వాద్యములయందు ప్రమోయించు "wolf note" అనుదాని ఫీణా

తంతువుల ప్రకంపన విధానమును గూర్చి యాతఁడు చేసిన పరిశోధన యొకటి. మన సంగీతవాద్యము లగు వీణ, తంబుర మున్నగువానియందు జనించు మనోహరధ్వని వాని కమర్చిన పీఁటలయుఁ ద్రాళ్ళ బిగింపులయు ప్రభావముననే యని యాతఁడు తెల్చిన పరిశోధన మింకొకటి. ఈతఁడు 'లండను' లోని 'సెంటుపాల్సుచర్చి' లోను, కలకత్తానగరమందలి 'విక్టోరియా మ్యూజియము'లోను గలుగు ప్రతిధ్వనులఁగూర్చియు గొన్ని పరిశోధనలఁ జేసియుండెను. ఇటీవల నీతఁడు రత్నములను గూర్చి చేసినపరిశోధనయు నాతని కెంతయో కీర్తి నొసఁగి యున్నది. ఇట్టి మహాశయునకు ౧౯౩౦ అక్టోబరు ౨౫వ తేదీని భారతప్రధాని నెహ్రూపండితుఁడు దన యాస్థానమున నమితగౌరవము చేసి వేనోళ్ళ నీతనిఁ గీర్తించినాఁడు.

## రామనుపండితుని దేశసేవ

రామనుపండితుఁ డిట్టిపరిశోధనలఁ జేయుచునే యుత్తమ పరిశోధకుల నెందఱినో తయారుచేసి వారివారికిఁ దగినశిక్షణ మిచ్చి యుండు టొకగొప్పవిశేషము. ఇంతేకాక, వివిధ విశ్వవిద్యాలయములలోనున్న విజ్ఞులుచేయుపరిశోధనముతీవ్రముగా సాఁగుటకును నవియున్నతఫలితములనుద్వరితగతి నొసఁగుటకు నీతఁడుప్రత్యక్షముగాఁ గాకున్నఁ బరోక్షముగ నైనను సాధనభూతుఁడగుచున్నాఁడు. మఱియు, నూతనముగాస్థాపించియున్న స్థాపింపఁబడుచున్న విశ్వవిద్యాలయములకు, విజ్ఞానశాస్త్రకళాశాలలకు, పరిశోధనాసంస్థలకు, విజ్ఞానకేంద్రములకుఁదనసాహాయ్యసంపత్తినొసఁగుచు వానిని దీర్చి దిద్దుచుఁ బ్రధానపాత్ర

ధరించుచు వానివాని పురోభివృద్ధికి వెలలేనిసేవ యీతఁడు చేయుచునే యున్నాఁడు. అనేక విశ్వవిద్యాలయముల స్నాతకోపన్యాసములలో, మఱి యనేక సంస్థల వార్షికోత్సవములలో, నీఁక నెన్నో సమితుల సభలలో వెల కట్టరానివాక్యముల నిచ్చి నిరుపమాన మగు దేశసేవ యీతఁడు చేయుచునే యున్నాఁడు.

## ఉ ప దే శ సా ర ము

ఆయాసందర్భములలో రామనుపండితుఁ డొసఁగిన యుపదేశరత్నములను గొన్నిటినైన మన మేఱుకొని దాఁచుకొన వలసిన యవసర మెంతయో కలదు. ఆతని యుపదేశసారమిది:

"భారతీయులను మించిన ప్రతిభాశాలురు ప్రపంచమున లేరు. కాని, యున్న బాధ యొక్కటి కలదు. నాకన్న మిన్న యెవఁడని యుత్సాహము తెచ్చుకొనుటకు బదులు పాశ్చాత్యునికన్నఁ దాను దక్కువయని యనుకొనుభావ దౌర్బల్యమే భారతీయుల పతనహేతువైనది. మనకుఁ బరిశోధనావకాశము లేవి? మన మేమిచేయఁగల? మనుకొనుట యవివేకము. ఉన్న వానినే యుపయోగించుకొని మనప్రతిభ చూపవలయును."

'విజ్ఞానము, మఱింతవిజ్ఞానము, ఇంక నింతవిజ్ఞానము. ఇదియే మన యాదర్శము కావలయును. పాశ్చాత్యవైజ్ఞానికుల మారణయంత్రముల నవలీలగా జయింపఁ గలుగు విజ్ఞానము మనకుఁ గలదు. మన యాసక్తి, దీక్ష, పట్టుదల, బుద్ధికుశలత, నిరంతరకృషి— వీనివలన మన మేదైనను సాధింపఁ గలము."

"విజ్ఞాన మను కామధేనువు నాశ్రయించి మానవుఁడు పొందరాని కోరికలే లేవు. మన పరిశ్రమాభివృద్ధికి, మన నిత్య జీవితావసరములకు, దారిద్ర్యమును పాఱఁద్రోలుటకు మనము వైజ్ఞానికులమే కావలయును."

## రామను పండితుని యనుయాయులు

రామనుపండితుఁడు కలకత్తాలో నున్నపు డాతని యాధ్వర్యవమునఁ దేశశ్శాస్త్రమునఁ జక్కని పరిశోధనలు చేసి కీర్తి గడించినవా రనేకులు గలరు. వారిలో డాక్టరు కె. ఎస్. కృష్ణన్, ఇచ్ఛాపురపు రామకృష్ణారావు, సూరి భగవంతము, మున్నగువారు ముఖ్యులు.

వీరిలో డాక్టరు కె. ఎస్. కృష్ణన్ రామనుపండితుని దీక్ష, ఓరిమి, విజ్ఞానతృష్ణ, నిరంతరకృషి, ఉత్సాహము మున్నగు సుగుణముల నాతనినుండి పుణికిపుచ్చుకొని యున్నతపరిశోధనలు చేసి మిక్కిలి ఖ్యాతిగాంచినాఁడు. రామనుపండితుఁడు ౧౯33వ సంవత్సరములో బెంగుళూరులోని భారతవిజ్ఞాన సంస్థకు వచ్చివేసినతరువాత, కలకత్తాలో మఱుచటి వత్సరము మహేంద్రలాల్ సర్కారుపేర నెలకొల్పఁబడిన భారతవిజ్ఞాన కృషి సంఘప్రధానాచార్యపీఠమును సగౌరవముగా నలంకరించినవాఁ డీతఁడే. ఏడెనిమిది సంవత్సరములు కృష్ణ నచట బహుపరిశోధనలు చేసియున్నాఁడు. అందు "సూదంటుఱాయి" "స్ఫటికము" మున్నగువానిమీఁద నీతఁడు చేసిన పరిశోధనలత్యద్భుతములు. ఈతని ఖ్యాతి కచ్చెరు వంది యలహాబాదు

విశ్వవిద్యాలయమువా రీతనిని దమ పదార్థవిజ్ఞానాచార్యునిగా నాహ్వానించి తీసికొనిరి. అక్కడ నీతఁడు ముక్కవాసినదీక్షతోఁ బెక్కు పరిశోధనలు నేఁటికిని జేయుచునే యున్నాఁడు.

మొట్టమొదట నాంధ్రదేశములోని విజ్ఞానపరిశోధనలకుఁ బెట్టినది పేరు విజయనగరకళాశాల. వానికిఁ బ్రముఖపాత్రను వహించిన మేధావి డాక్టరు అప్పాద్వేదుల లక్ష్మీనారాయణ. ఆయన పర్యవేక్షణక్రింద రామనుపండితుని యాశీర్వచనములతోఁ బరిశోధనలు చేసి యీ పిమ్మటఁ బాశ్చాత్యదేశముల కేఁగి యున్నతశాస్త్రవిద్య నభ్యసించి తిరిగివచ్చి తమపదార్థ విజ్ఞాన పరిశోధనలచే వాసిగన్నవారిలో రామకృష్ణారావు, భగవంతము, రంగధామరావు ముఖ్యులు. వీరు నేఁటికి నున్న తపదవులలో నుండియు విజ్ఞానపరిశోధనలు చేయుచునే యున్నారు.

ఈ విధముగా రామనుపండితుని సాహాయ్యసౌహార్ద సంపదల నంది యాతనివలనఁ గీర్తిప్రతిష్ఠలు గాంచినవా రెందఱో కలరు. వీరు కాక, రామనుపండితుని మిత్రులై యాతని సూచనలను గ్రహించుచు నపుడపుడు పరస్పర పరిశోధనల ఫలితములను, వాని మంచిచెడ్డలను జెప్పుకొనుచు విఖ్యాతులైనవారిలో ముఖ్యులు మేఘనాధసాహా, హామీూజహాంగీరు భాభా మున్నగువారు. వీరిలో మేఘనాధసాహా ౧౯౨౩ నుండి ౧౯౩౮ వఱకు అలహాబాదు విశ్వవిద్యాలయములోఁ బదార్థవిజ్ఞానాచార్యుఁడుగా నుండి ౧౯౩౮వ సంవత్సరము నుండి కలకత్తా విశ్వవిద్యాలయమున 'పాలిట్' పదార్థ విజ్ఞానాచార్యుఁడుగాఁ బని చేయుచున్నాఁడు. ఈతని ప్రఖ్యాత

పరిశోధనలు. "అయనీకరణ సిద్ధాంతము" "ఖగోళవర్ణపట్టిక" (spectrum) మున్నగునవి.

ఇఁక, భాభా విదేశములనుండి యుద్ధకారణమున స్వదేశమునకుఁ దిరిగివచ్చి బెంగుళూరుచేరి రామనుపండితుని సౌహార్ద సఖ్యముల గడించి భారత విజ్ఞానసంస్థయందు సహాయపదార్థ విజ్ఞానాచార్యుఁడుగాఁ జేరినాఁడు. ఈతఁడు యువకుఁడు. చక్కని యుత్సాహము కలవాఁడు. పరిశోధనలయందు దీక్ష యీతని కపరిమితము. ఆ కారణములచే. నీతఁడు రామనుపండితుని కడ నుండి "కాశ్మిక్ కిరణములు" కాస్మిక్" కిరణసంపాతము వలని యుత్పత్తి" "హైట్లర్ కాస్కేడుసిద్ధాంతము" వీనిపై.నమోఘ మగు ఫలితమును జూపి యుండి జగద్విఖ్యాతిఁ గాంచినాఁడు. ఈతనిప్రతిభఁ గనిపట్టియే బొంబాయినగరమునందలి తాతా సంస్థవారీతని నాహ్వానించి తమపరిశోధనసంస్థకుఁ బ్రధాననిర్వాహకునిగాఁ (Director) గైకొని గౌరవించిరి. ఈతఁ డిప్పుడచ్చట నుండి నిరంతర కార్యదీక్షతో "కాస్మిక్ కిరణములు" పైనే కాక పరమాణుశక్తిని (Atom) గూర్చియు సుప్రసిద్ధమైన పరిశోధనలు చేయుచున్నాఁడు.

ఈవిధముగా రామనుపండితుని సాహాయ్యసంపద నందిన వారెల్లరు చాలగొప్పవారైరి. ఇప్పటికి నగుచున్నారు. విస్తారమైనకాంతి నిచ్చి యాహ్లాదము కలిగించు నొకచక్కని జ్యోతి యున్నప్పుడు దానిసోఁకుడుచేత నే వెలిఁగి కాంతి నిచ్చు జ్యోతులనేకములు బయలుదేఱుటలో నాశ్చర్యము లేదుకదా!

## రామనుపండితుని శీలము

ఇంతటి వైజ్ఞానికశిరోమణి యయ్యు రామనుపండితుఁడు నిగర్వచూడామణి. ఆతనికి వినయమే మహాభూషణము. మన పూర్వుల యాచారసంప్రదాయములే మనకు సదా యాచరణీయము లని యాతనిభావము. ఐనను, సీతఁడు త్రిపురసుందరి యనుకన్యను వలచి యామెయుఁ దన్ను మిక్కిలి ప్రేమించి తన్నుఁ దక్క నన్యులఁ బెండ్లాడ నని నిశ్చయించుకొనఁగా, సీతఁ డామెనే పెండ్లాడి యీ విషయమునఁ దన స్వాతంత్ర్యతను వెల్లడించెను. ఆతఁడు నిత్యసత్యసంధుఁడు. భౌతికవిజ్ఞానమే యాతని జీవిత సర్వస్వము. ౧౯౫౦ అక్టోబరు 30 వ తేదీని కాన్పూరులోని పురపాలకసంఘమువారు చేసిన గౌరవమునకు సమాధాన మిచ్చుచు నాతఁడు చెప్పినమాట లాతని శీలమును వ్యక్తముచేయును. "నాకు విజ్ఞాన మన్నఁ బ్రాణము. నాకు నా దేశ మన్న మిక్కిలిప్రేమ. అందలి యడవు లన్న మఱింతప్రేమ. అంతేకాదు, నా దేశములో నున్న యణువును గూడ నేను బ్రేమింతును. మంచి దేదైనను నేను దప్పక గౌరవింతును. ప్రేమింతును. నేర్చుకొనుటయన్న నా కన్నిటికన్న మిక్కిలి యిష్టము. నేను బ్రతిక్షణ మేదో నేర్చుకొనియే యున్నాను. నేర్చుకొనుచునే యుందును. నేను నేర్చుకొనుచునే నా ప్రాణములు విడిచిపెట్టెదను."

వినయమునకు నిధి యైన యీతనికి మిక్కిలి హాస్యరసభరిత మగు సంభాషణాచాతుర్యము గలదు. దానివలన సీతని

మాటలు పలుమారు విన్నవారికిని మరలమరల వినవలయు ననియే యుండును.

దేశక్షేమమే తన శాస్త్రీయపరిశోధనల కాదర్శ మని యెంచిన దేశహితైషి రామను. దేశమునఁ గల పంచదార కొఱఁతను గుఱించి ౧౯౫౦ అక్టోబరు 29 వ తేదీని కాన్పూరు పంచదార పరిశోధనసంస్థ వెండిపండగనాఁడు ప్రభుత్వము వారికి 'కంట్రోలు పద్ధతులు' మన దేశమునకు క్షేమకరములు కావని నిర్భయముగఁ జెప్పి, పదార్థ విజ్ఞానశాస్త్రజ్ఞులే పరిశోధనలవలన దేశక్షామమును బోఁగొట్టఁగల రని యుపదేశించి పంచదారపై 'కంట్రోలు' తొలఁగింపవలయునని దొరతనము వారికి సూచించెను. ఈతనిది నిర్భయతత్త్వము; తలఁచినది నిర్భీతితోఁ జాటఁగల ధీశాలురలో నీతఁ డగ్రేసరుఁడు.

రామనుపండితుఁడు బాల్యమునుండియు విజ్ఞానముపైఁ జూపినయుత్సాహము, అభిరుచి, పట్టుదల, శ్రద్ధ, వెనుదీయని సాహసము, గాంభీర్యము మున్నగు సుగుణముల మూలముననే మహాఖ్యాతి నందినాఁడు. ఈతని సుగుణముల నలవఱచుకొని విద్యార్థు లెల్లరు నీతని చరిత్ర చదువుటవలని ఫల మంద వలయును.

# రత్నత్రయము

## 3

## విద్వత్కవిరత్నము : పండితరాయలు

---

ఏ దేశసౌభాగ్యమునకైన నా దేశసంపదయే మూలకందకము. సంపదయన్న నొక్క ధనమే కాదు. మానవుని జీవితమున కున్నతస్థితిని గొనితేఁగల యొకవస్తువుకాని యొక గుణముకాని యోతని సంపదయే యగును. ధాన్యసంపద, వస్తుసంపద సుగుణసంపద, ఆరోగ్యసంపద, బుద్ధిసంపద, పశుసంపద మున్నగునవన్నియు సంపదలే. వీనియన్నిటిని మించినది విద్యాసంపద. ఎంత యున్నతోద్యోగియైనను, మహా ధనవంతుఁడైనను నొక వ్యక్తి కొన్నిచోట్లనే కొందఱిచేతనే పూజితుఁడగును. మఱి విద్వాంసుఁ డన్ననో యందఱిచేతను సర్వప్రదేశము లందును బూజితుఁడే యగును. అట్టివిద్వాంసుఁడే విజ్ఞాని. విద్వాంసుఁడైన వాఁడు సత్కవి యైనచో నది బంగారునకుఁ దావి యబ్బుటే యగును. అట్టివారినే మనము విద్వత్కవు లని యందుము. విద్వాంసుఁడు కవి కాకపోవచ్చును, కవి విద్వాంసుఁడు కాకపోవచ్చును. ఈ రెండును సమకూడుట చాలఁ గష్టము. కాని మన దేశమున నెందఱో విద్వత్కవులు పుట్టి పెరిఁగి తమ తమ కావ్యసంపదలను మన కందిచ్చి శాశ్వతత్వము నందఁ

గనినాడు. అట్టి విద్వత్కవులలో రత్న మనఁ దగినవాఁడు పండితరాయలు. ఈతఁడు భారతీయుఁ డగుటయు నందును ముఖ్యముగా నాంధ్ర దేశీయుఁ డగుటయు మన యదృష్టము.

బాల్యమునుండియు జీవితమున నతికష్టపరిస్థితుల నెదుర్కొని వానిని దాఁటి విజయము నందిన ధీశాలియే యీతఁడు. ఉత్సాహశూరుఁడై యన్నిపరిస్థితులలోను ధైర్యశాలియై తన బుద్ధిబలమునఁ బాండిత్యవిశేషమున మొగలాయీ చక్రవర్తుల విశేషగౌరవము నీతఁ డందఁగనుటే కాక హిందూ మహమ్మదీయ సఖ్యమునకు శాశ్వతమగు దారిచూపిన మహనీయుఁ డీతఁడు. విజ్ఞానమునకు జాతిమతభేదములు లేవు. అది యెల్లరకు నెల్లవేళలఁ బూజనీయమే యని తన జీవితమున ధ్రువపఱచిన విద్వత్కవిరత్న మీతఁడు. ఎంత సానఁబట్టిన నంతగా రత్నము ధగధగ కాంతు లీనునట్లు, మానవుని కెన్ని కష్టములు వచ్చినను సాహసము, ధైర్యము, పట్టుదల, కార్యశూరత, మున్నగు వీరలక్షణము లున్న యెడల నావ్యక్తి యెంతగొప్పవాఁడైన నగు ననుటలో సందేహము లేదని యీతని జీవితము మనకు వెల్లడిచేయును.

## జ న న ము

భారత దేశమునఁ గల యన్ని రాష్ట్రములలోను జెన్న రాష్ట్రము, ప్రత్యేకించి యందాంధ్ర దేశము సస్యశ్యామలము సౌభాగ్యసంపన్నము నని పేరెన్నికగన్నవి. అందు గోదావరీ నదీప్రాంత భూభాగము బహు పుణ్యప్రదము, సారవంతము ననుఖ్యాతి గలది. ఇటనే పూర్వఋషులు తపస్సు చేసి జ్ఞాన

సంపద నార్జింపఁ గలిగిరని ప్రతీతి. నేఁటికిని గ్రొత్తలంక యోగి, మున్నిడివరము బాలయోగి మున్నగువారీపరిసరము లందే తమ యోగమహాత్మ్యమును జూపియున్నారు.

ఈ ప్రాంతమునే 'కోనసీమ' యనియుఁ, 'గోనసీమ' యనియు జనులు వ్యవహరింతురు. ఇచటఁగల కొబ్బరి, పోఁక, అరటి, పనస, మామిడి మున్నగువృక్షములు భూలోకకల్పకము లని పేరు గడించినవి. ఈ ప్రాంతమందలి గ్రామము లెంతెంత పవిత్రములై యుండెడివో వానివాని నామధేయములే మనకు నేఁటికిని దెలుపుచుండును. మునులచేఁగోమలమైన యొకగ్రామ మే నేఁడు 'మునికోమల' (ముక్కామల) యనుపేర వెలయు చున్నది. దానిప్రక్కనే 'ఋషిమండలము' (ఇరుసుమండ) అను గ్రామము కలదు. ఇటనే యుండి విఖ్యాతిగన్న పల్లెల పురిని (పలివెల) శ్రీనాధకవి యెంతయో గొప్పగా వర్ణించి యున్నాఁడు. ఇట్లే 'ముక్తీశ్వరము' 'కోటిఫలి' 'ద్రాక్షారామము' మున్నగు నతి ప్రసిద్ధక్షేత్రము లీప్రాంతముననే గలవు. మునిముఖ్యులు యజ్ఞయాగాదులు చేయుచుండఁగా దేవతలు వచ్చియుండెడివారనియో లేదా సర్వఫలవృక్షములతో భూలోక స్వర్గమనఁదగిన దగుటచేతనో 'అమరపురము' అని నాఁడు వ్యవహరింపఁబడిన యూరే నేఁటి యమలాపురము. దీనికి సమీపముననే 'మునిఖండ' మనుపేర నొక గ్రామ మున్నది. అదియే నేఁటి 'ముంగండ'.

ఈ గ్రామమునఁ గ్రీస్తుశకము పదునాఱవ శతాబ్దమున వేగినాటిశాఖకుఁ జెందిన యొక బ్రాహ్మణుఁడు నివసించు చుండెను. ఆతని పేరు పేరుభట్టు. ఆతఁడు పండితనిలయ మగు నాప్రాంతముననే యనేక శాస్త్రములు, మంత్రతంత్రములు చదివి ప్రసిద్ధికెక్కెను. ఆతని భార్య పేరు లక్ష్మమ్మ. ఈదంపతులు సగౌరవముగాఁ గాలక్షేపము చేయుటకు వలయు భూస్థితి మాత్రమే కలవారు. ఆకాలమువారికి సహజముగాఁ గోరికలు, చాపల్యములు తక్కువ యగుటచే నున్న దానితోడనే తృప్తిపడి కలియో గంజియో త్రాగి వారు కాలము పుచ్చు చుండువారు. పేరుభట్టు తన విధ్యుక్తధర్మములను నిర్వర్తించు కొనుచు శిష్యులకు శాస్త్రపాఠములు చక్కఁగా బోధించుచు నుండువాఁడు. "ఆతఁడు పాషాణములనుండి కూడ లీలామాత్రముగ నమృతము పిండఁగల సమర్థుఁ" డని పండితరాయలే తనయొక గ్రంథమునఁ జెప్పికొనెను. అనఁగా సామాన్యులకు రుచింపని తర్కమీమాంసా వ్యాకరణాది పాఠములు చెప్పునపుడుకూడ నాతఁడు చాల సరసముగాఁ జెప్పి యెంత తెలియని మొద్దుల కైనను దేటతెల్లముగాఁ దెలియునట్లు తెలుపఁ గలిగిన మంచి సమర్థుఁ డగు పండితుఁ డని భావము. ఈ పేరుభట్టు వేదాంతశాస్త్రమును జగత్ప్ర సిద్ధుఁ డగు 'జ్ఞానేంద్రభిక్షు' వను మహామహుని యొద్దను న్యాయవైశేషికములు 'మహేంద్రుఁ' డను సద్గురువుకడను, పూర్వమీమాంసాశాస్త్రమును 'ఖండదేవమిశ్రుఁ' డను కాశీ పండితునియొద్దను, వ్యాకరణశాస్త్రమును 'శేషవీరేశ్వరుఁ'డను

మహాపండితునియొద్దను క్షుణ్ణముగాఁ జదివినదిట్టు. పేరుభట్టు భట్టోజీదీక్షితుఁ డను ప్రఖ్యాత పండితుని సహాధ్యాయి, పేరు భట్టు తండ్రి కూడ నెంతయో పేరు గాంచిన పండితుఁడై, 'ప్రక్రియాప్రకాశ' మను గొప్ప గ్రంథమును వ్రాసి పేరందిన 'శేషకృష్ణుఁడు'. వీరి యింటిపేరు 'ఉపద్రష్ట' వారు.

లక్ష్మమ్మ పేరుభట్టుల యనంతమగు పుణ్యమునకు ఫలమై పుట్టిన ముద్దుబిడ్డఁడే పండితరాయలు. పండితరాయ లన్నది బిరుదము. ఈతని యసలుపేరు జగన్నాథుఁడు. జగన్నాథుని జన్మకాలము క్రీస్తుశకము ౧౫౯౦ ప్రాంతము. నేఁటి వారివలె నాఁటివారలు తమతమ పుట్టుపూర్వోత్తములను జీవితచరిత్రలను వ్రాసిపెట్టుకొను స్వభావముకలవారు కారు. ఆకారణముచే నెంతమంది పరిశోధకు లెంతెంత పరిశోధించినను నీతని జన్మతిథివార నక్షత్రము లేమియు లభింపని కారణమున నూహింపుగనే కాని యితమిత్థ మని యీతని జన్మవత్సరమును నిర్ణయింపఁ గష్టము.

## బాల్యము

జగన్నాథుఁడు జన్మముచేతనే యుత్తమ మగు సంప్రదాయమును సంపాదించెను. మహాపండితుఁ డగు పేరుభట్టు తన పుత్త్రుని నల్లారుముద్దుగాఁ బెంచుచు నాతనికి బాల్యము నుండియు విజ్ఞానాభిరుచి కలిగించెను. దానికిఁ దోడు పేరుభట్టు మూఁడు వంతులు తనకాలము పండితగోష్ఠిలోను, శిష్యులకుఁ బాఠములు చెప్పుటలోను గడపుచుండెడివాఁ డగుటచే నీ పరి

సరములు తెలియకుండఁగనే జగన్నాథునికి మంచి విద్యాభి రుచిని బొపొందించెను. చిన్నతనమునుండియు నాతని మేధ సునిశితముగ నుండియుండుటచే ననేక విజ్ఞానబీజము లాతని మనమున నాఁటుకొని కాలక్రమమున మొలకెత్తి యుత్తమ పుష్పఫలముల నొసంగినవి.

జగన్నాథునకు యుక్తకాలమున నుపనయనము చేసి పేరుభట్టు వ్యాకరణశాస్త్ర మొక్కటితక్క మిగిలిన యన్ని శాస్త్రములు తానే చెప్పెను. ఈమధ్యకాలముననే లక్ష్మమ్మకు మఱియొక కుమారుఁ డుదయించెను. అతని పేరు రామచంద్ర భట్టు.

ఇట్లుండఁగా జగన్నాథునకుఁ గలిగిన విద్యాకాంక్ష యత్యధికమయ్యెను. అతఁడు తండ్రి చెప్పిన శాస్త్రములతోఁ దృప్తి పడక యింకను జదువవలయు నని మిక్కిలి కుతూహల పడెను. అతనికి శాస్త్రజ్ఞానముతోపాటు సాహిత్యజ్ఞానము నధికమైనంత నాతనిబుద్ధి సర్వవిషయములను గ్రహింపఁ బర వశులు త్రొక్కుచుండెను.

## విద్య

ఆ కాలమున నాంధ్రదేశీయు లగు పండితులకుఁ గాశి వెడలి యచట పండితులకడ బాగుగాఁ జదువుకొని వచ్చిన వాఁడే పండితుఁడని యొక విశ్వాస ముండెను. ఆ కారణమున సాధారణముగాఁ గొంత చక్కని శాస్త్రజ్ఞానము కలుగఁగనే నాఁటి విద్యార్థులు కాశికాపురి కేఁగి యచటఁ గల దిగ్దంతు లగు పండితులయొద్దఁ జదువుకొని తిరిగి స్వదేశమునకు వచ్చి ఖ్యాతి నందుచుండెడివారు. అపుడు కాశీనగరము విద్యలన్నిటి

కీని నిలయమే కాక పరీక్షాస్థానముగాఁ గూడ నుండెడిది. మన యాంధ్రదేశీయు లగు పండితు లెందఱో కాశీపండితులను వాదమున నోడించి కాశ్మీరపు సేలువలతో గండపెండేరము లతో బహు గౌరవము లంది వచ్చుచుండెడివారు. ఆ కారణ మున జగన్నాథుఁడుకూడఁ గాశీపండితులయొద్దఁ జదివి వత్తు నని తలిదండ్రుల యాజ్ఞఁ గోరెను. వారును బుత్త్రుని మేధా శక్తి, విద్యాభిరుచి, సునిశితబుద్ధిబలము నెఱిఁగినవా రగుట వల్లె యనిరి.

## కా శీ వా స ము

కుశాగ్రబుద్ధియు, సాహసికుఁడు, విద్యాకాంక్షి యగు జగన్నాథుఁడు పదునైదు పదునాలువత్సరములు వచ్చుసరికిఁ దండ్రిదగ్గఱఁ జదువు చాలించి వ్యాకరణశాస్త్రమును గాశి కానగరమునఁ జదువఁగోరి పయనమునకు సిద్ధపడెను.

నాఁటివిద్యార్థులకు బుద్ధిబలముతోపాటు దేహబలము కూడ నధికముగనే యుండెడిది. నాఁటి వేషభాషలు విద్య నేర్చుకొనుటకుఁ జాల ననుగుణముగా నుండెడివి. నాఁటివిద్యా ర్థులందఱును బ్రహ్మచారులే. విద్య పూర్తియైననే కాని పెండ్లి మాటయే యప్పటివారు తలంపరైరి. నాఁటివిద్యార్థికి వలయు సాధనసామగ్రి నాలుగు గోఁచిగుడ్డలు, నాలు గంగవస్త్ర ములు, చేత నొక చెంబు. భోజనము వారమున కొక్కొక్క దినము చొప్పున గృహస్థుల యిండ్లలో. లేదా మధుకరవృత్తి, (మధుకర మనఁగాఁ దుమ్మెద. అది పూవుపూవునకు నేఁగి యొక్కొక్క చుక్కవంతునఁ దేనె ప్రోగుచేసికొనును.) అనఁగా

నాఁకలి యగువేళ కేరెండుమూఁడిండ్లకో వెడలి యాయిండ్ల లోని సాధ్వీమతల్లులు పెట్టిన పట్టెఁడన్నముమాత్రము – తన పొట్ట కాఁకలి తీరుటకు వలయునది మాత్రము – గైకొని భుజించి పిమ్మట గురుశుశ్రూష చేయుచు విద్య నేర్చుట.

దీనికి ముఖ్యముగాఁ గన్నతల్లిదండ్రులను మన్నయింటిని విడిచి దూరదేశమున కొంటరిగాఁబోయి యచ్చట నొక్కఁడు నెంతకాలమో తెలియని చదువునకు సంసిద్ధపడి యుండవల యును. ఇందులకుఁ గావలసిన గుణములు కన్నవారిమీఁద మన్నయింటి మీఁదఁ గల మమకారమును విడిచిపెట్టుట. దేహమునకు సుఖమును గోరకుండుటే కాక కష్టముల నెదు ర్కొనుటకు సిద్ధపడుట. అహంకారము చంపుకొనుటకు గురు వులకు సేవచేయుట. సర్వోత్తమమైన విద్య సంపాదించుటకై యెట్టి యవమానములు కలిగినను జిన్నఁదనము చూపకుం డుట. ఎట్టి కష్టసమయములనైనను ఖిన్నవదనము రానీకుం డుట. జగన్నాథుఁడు వీనియన్నిటికి సిద్ధపడి విద్య నార్జించు టకై యెంత శ్రమపడుటకైన నంగీకరించి సాహసించి బయ లుదేఱి కాశీనగరము చేరెను.

అతఁడటఁ జేరి పైఁజెప్పినవిధముననే కాలక్షేపము చేయుచు శేషవీరేశ్వరుఁడను గురువునొద్ద వ్యాకరణశాస్త్ర మును మఱికొందఱు ప్రఖ్యాతులకడ నితరశాస్త్రములను బూర్ణముగాఁ జదువుకొని పండితరత్నమని యచటవారలచే మన్ననలఁ గాంచుటచే నీతని కీర్తిచంద్రిక లట వ్యాపింపఁ దొడఁగెను.

ఈ ప్రకారము జగన్నాథుఁడు కాశీనగరమున నేడెని మిదేండ్లుండి యుత్తమశాస్త్రవిజ్ఞానమే కాక సంస్కృతమున నఖండమగు సాహిత్యమలవఱచుకొని చక్కని సంస్కృత కవిత్వము చెప్పి పెద్దపండితులకే యాశ్చర్యము కలిగించు చుండెను. అంత నాఁతడు గురువుల సెలవు కైకొని కాశీపురి విడిచిపెట్టి తన గ్రామమగు మునిఖండమును జేరుకొనెను.

## వివాహము

జగన్నాథుఁడు విద్యాసంపన్నుఁడై కీర్తిలక్ష్మినిగూడి యింటికి రాఁగానే యాతని తలిదండ్రులు పొందిన యానంద మింతింతకాదు. ఔను, పుత్త్రుఁడు పుట్టినపుడు కాక యాతఁడు పెరిఁగి పెద్దయగుచు విద్యాబుద్ధులు కఱచి సరివారిలో మెప్పు పొందియుండఁగా జనులందఱు నాతనిని బొగడు చున్నపుడే గదా తలిదండ్రులకుఁ బుత్త్రోత్సాహము!

బ్రహ్మచర్యాశ్రమమును గడపి సర్వవిద్యలు సంగ్ర హించి వచ్చినకుమారుఁ డింక గృహస్థాశ్రమమును స్వీకరింపఁ గాఁ దాము చూచి యానందింత మని యాతని తలిదండ్రు లెంచి రూపవతియు గుణవతియు నగు 'కామేశ్వరి' యను నొక్క కన్యతో జగన్నాథునికి వివాహము జరిపిరి.

పదునాఱుకళలతో నిండిన పున్నమచంద్రునివలె వ్యాక రణము, శిక్ష, ఛందస్సు, మీమాంస, తర్కము, వేదాంతము నను నాఱుశాస్త్రములలో నద్వితీయపండితుఁడై, సాహిత్య జ్ఞానమునను గాణాచియై యొప్పిన జగన్నాథపండితుఁడును -

శుక్లపక్షక్షపాకరునిఁ జెట్టపట్టి మహాసౌభాగ్యవతి యైన రోహిణీదేవిని సరిపోలి పండితచంద్రముని సహధర్మచారిణి యైన కామేశ్వరియు,-నాదర్శదంపతులై గృహస్థాశ్రమమునఁ బ్రవేశించిరి.

## సంచారము

ఎల్లవారికి నెల్లకాలము నొక్కరీతిగాఁ గడవఁ బోదు. ఓడలు బండ్లగుచుండును. బండ్లోడ లగుచుండును. సుఖముగ నున్నవారలకుఁ గష్టములు కష్టమున నున్నవారలకు సుఖములు వచ్చుచుఁ బోవుచు నుండును. ఇది లోకధర్మము. అంతియే కాని, నిత్యమును సుఖసముద్రమున నోలలాడువ్యక్తి కాని, యెల్లకాలము దుఃఖవారాశిమగ్నుఁడే యై యుండు మానవుఁడు కాని యుండఁడు. రాత్రి కడచి పగలు, పగలు కడచి రాత్రి వచ్చునట్లు, శీతకాలము పోయి వేసవికాలము వేసవికాలము పోయి వర్షకాలము వచ్చునట్లు జీవితమున నెన్నో పరిస్థితులు కష్టసుఖములఁ గూర్చుచు మార్చుచు నుండును. ఈ కాలచక్రపు మార్పులకు వివేకహీనుఁడగు నరుఁడు సుఖసమయముల సంతోషముతో నుబ్బిపోయి గర్వపడి భూమిపై నిలువఁడు. ఎల్లవారలను దృణీకరించును. తన కన్న మిన్న లున్నారని యెన్నఁడాతఁ డెన్నఁజాలఁడు. కొంత కాలమున కీ కాలచక్రప్రభావముననే యాతనికి దుఃఖములు తప్పక సంప్రాప్తమగును. అపుడాతఁ డొక్కసారిగాఁ గ్రుంగి పోయి దీనచిత్తముతో నేడ్చుచుఁ దన కీస్థితి భగవంతుఁడు కల్పించినాఁ డని యాతనిఁ దిట్టుచు మనశ్శాంతిలేక పెద్దలను

నిందించుచు సధైపతితుఁ డగును. మఱి, వివేకవంతుఁ డగు మహాపురుషుఁ డన్ననో సుఖముల కుబ్బిపోఁడు, ఆత్మపరిశాంతిని గోలుపోఁడు. ఈ కష్టసుఖము లను జంట యొకకాలమున వచ్చి యొక కాలమునఁ బోవునదే యని తెలిసికొొను ధైర్యవంతుఁడై విజ్ఞానము గడించి యున్నతస్థితి నందును.

అట్లే జగన్నాథపండితునకు వివాహమై భార్య కాఁపురమునకు వచ్చిన కొంతకాలమునకే తండ్రి పరమపదించుటయు సంసారబాధ్యత యంతయు నీతనిపైఁ బడుటయు నాఁటికింటఁ దినఁ దిండియుఁ గట్ట బట్టయు నైనను జాలినంత లేకుండుటయు సంభవించెను. కాని జగన్నాథుఁ డావంతయు దైన్యపడక విశాలప్రపంచ మున్నదనియుఁ దనకెన్నఁడును లోటు కలుగదనియు నెంచి, దేశసంచారము చేయ సమకట్టెను. ఇప్పటి కితని వయస్సు సుమారు రిరువదినాలుగు సంవత్సరములు మాత్రమే.

జగన్నాథపండితుఁ డిట్లు సంచార మారంభించి యెందఱో రాజుల యాస్థానములను జూచియు దిగ్దంతు లగు పండితులను శాస్త్రచర్చలలో నోడించియుఁ బెక్కండ్రచే మిక్కుటమగు గౌరవమును, జాలధనమును నార్జింపఁజొచ్చెను. అట్లార్జించిన ధనము కొంతకాలము తల్లికిఁ దమ్మునకుఁ బంపుచు వా రేకొఱంతయు లేక పరమసుఖముగా జీవింప ననువగు పరిస్థితులను గల్పించెను. కాలక్రమమునఁ దల్లి మరణించుటయుఁ దమ్ముఁడు విద్యాకాంక్షియై కాశికానగరమున

కేఁగి యచట వసించుచుండుటయుఁ గారణములుగా జగన్నాథపండితుఁడు భార్యను వెంట నిడుకొని మరల సంచారము నారంభించెను.

దక్షిణహిందూ దేశమునఁ బెక్కుసంస్థానములు దర్శించి యాతఁడు బహువిధగౌరవము లందెను. దానితో నాతని కీర్తిలతిక దినదినమును దేశము నలుగడల నల్లుకొనఁజొచ్చెను. జగన్నాథపండితునకుఁ బండితులలోను, సంస్థానములలోను, వివిధప్రజల హృదయములందును గౌరవప్రతిష్ఠలతోఁ గూడిన యున్నతస్థానము లభించెను. ఈతఁడు విశాఖపురిప్రాంతమునఁ గల జయపురసంస్థానమునను గామరూపదేశమని నాఁడు పిలువఁబడి యస్సామని నేఁడు పరిగణింపఁబడుచున్న దేశముననను నత్యధికమగు గౌరవము లందెను.

చక్కనిలత కేదేని చక్కని యాశ్రయము లభించినపుడే యది చక్కఁగా నల్లుకొనును. బంగరు పళ్ళెరమునకైనను గోడచేరుపు కావలయును. అది యపుడే శోభించును. అట్లే పండితుఁడు వనితయును, దగిన యాశ్రయములు లభించినపుడే యినుమిక్కలి శోభింతురు.

భూమి సారవంతమై పాదు బలవంతమై చీడపురుగులు లేనప్పుడు లత యెంత యల్లుకొన్నను నింకను వ్యాపింపఁగోరుచునే యుండును. అగ్నిదేవుఁడు సర్వభక్షకుఁడైనను నింకను నాహారము కోరుకొనుచునే యుండును. మహాసముద్రములు గంభీరములై పారములు లేకయే యొప్పుచుండును. అట్లే

మహాత్ములు మంచివిషయముల నల్పతృప్తులుకారు. కారాదు. మహావీరు లగు రాజులకు జయకాంక్ష, మహాపండితు లగు విజ్ఞానులకు పండిత సభావిజయము నిరంతరము కోరఁదగు నవి. అందుచే జగన్నాథుఁ డల్పసంస్థానములఁ దనకు లభించిన గౌరవములతోఁ దృప్తిపడక ఢిల్లీసంస్థాన రాజమర్యాద లందఁ గాంక్షించెను. ఔను. ఆతఁడు కవిసార్వభౌముఁడు. పండిత చక్రవర్తి. అట్టి యాతఁడు ఢిల్లీపాదుషాగౌరవమును గాంక్షించుటలో నాశ్చర్య మేమి? సింహ మెప్పుడు నేనుఁగు కుంభ స్థలమును బ్రద్దలు కొట్టి యందలి మాంసమునే తినఁజూచును గాని యల్ప మాంసఖండముల నాశింపదు. అట్లే మన జగ న్నాథపండితకవిసింహము నుచితమర్యాద నే కోరినది.

## ఢిల్లీదర్బారు ప్రవేశము

జగన్నాథపండితుఁడు తన పండిత దిగ్విజయములో నెం దఱో సంస్కృతపండితుల నేకాక పారశీకపండితులను సైతము నోడించియుండెను. పర్షియనుభాషలో నన తికాలముననే సుని శితబుద్ధిశాలి యగు నీతఁ డసమానపాండిత్యమును సంపాదిం చెను. దానివలన నాతఁడు మహమ్మదీయమతగ్రంథముల నన్ని టిని క్షుణ్ణముగాఁ జదివి చక్కఁగా నర్థము చేసికొని యవి హిందూమతధర్మములకు విరుద్ధములు కావనియు వాని నపా ర్థము చేసికొన్న కొందఱుమాత్రమే విపరీతార్థములఁ గల్పించు చున్నా రనియు నాతఁడు గ్రహించెను. అందుచే భారతదేశ మున నేకైకపండితుఁడగు తానే దీనికి సమన్వయము చేసి

హిందూ మహమ్మదీయసఖ్యమునకు వైజ్ఞానిక రాజమార్గము శేర్పఱుప సమకట్టెను. అందుచే నతఁడు ఢిల్లీనగరమున కేఁగి యటఁ దన హిందూమహమ్మదీయ మత పాండిత్యమును, ఉభయ మతసామరస్య భావములను బ్రజలలో వ్యాపింపఁజేయ మొదలిడెను. ఈతనిని గుఱించియు నీతని సద్భావములను గుఱించియు నెందఱో మహమ్మదీయపండితులు నాఁడు ఢిల్లీ పాదుషాయగు జహంగీరు చక్రవర్తికి నివేదించుచుండిరి.

జహంగీరు విద్యాధికుఁడు, వివేకవంతుఁడు, విశాల హృదయుఁడు. అతనికి హైందవమతముపై హిందూపండితులపై నత్యధికమగు గౌరవము. అందుచేత నే యాఁత డెన్నియో శాసనముల మూలమున హిందువులకు జరిగినయన్యాయములను దొలఁగించి వారి హృదయములఁ జూఱగొనెను. హిందూ మహమ్మదీయసౌహార్దమున కాతఁడు చేసియున్నకృషి యనల్పము. అందుచే నాతఁడు జగన్నాథపండితుని పాండితి, ప్రతిభ సామర్థ్యము నెఱిఁగి కేవల పండితపక్షపాతముతో హిందూ మహమ్మదీయ సఖ్యాభివృద్ధికాంక్షతో సగౌరవముగా జగన్నాథపండితుని దన యాస్థానమునకు దయచేయు మని యాహ్వానించెను. జగన్నాథపండితుఁ డంగీకరించి వెడలి, జహంగీరు హృదయమును నిజపాండిత్యవైభవముచే నిమిష మాత్రముననే స్వాధీన పఱుచుకొనఁగలిగెను. జహంగీరు యశోవర్ణనము నొక్క శ్లోకములోఁ జేసి జగన్నాథుఁ డాతనికి బహుస్తుతిపాత్రుఁడయ్యెను. పరుసవేది సోఁకినంతనే యేఱాయియైనను బంగారమము కావలసినదే కదా!

ఈ శుభసమయము మొదలు జగన్నాథ పండితుఁడు ఢిల్లీపాదుషాల ప్రేమగౌరవములకుఁ జాలకాలము పాత్రుఁ డయ్యెను. ఈజహాంగీరు జగన్నాథసమ్మేళనమువలన హిందూ మహమ్మదీయ సమ్మేళనమునకు గట్టిపునాదు లేర్పడఁగాఁ జక్కని సామరస్యసౌధము వెంటనే లేచినది. కాని, యది షాజహాను ననంతరము త్వరలోనే ధ్వంసమయ్యెను. ఏమైనను జహాంగీరు జగన్నాథసమ్మేళనము హిందూమహమ్మదీయుల కెల్లరకు శుభప్రదమే యయ్యెను.

## ఆసఫ్‌ఖానుతోడి స్నేహము

జహాంగీరు వివేకవంతుఁ డగుట హిందూమతమునఁ గూడ గౌరవము చూపుటకు నాతని మంచితనమే కారణము కాదు. దానికి మూలహేతువు 'ఆసఫ్‌ఖా' నని యే చెప్పవలయును. ఆసఫ్‌ఖాను నూర్జహాను సోదరుఁడు. షాజహానునకు మామగారు. అతఁడు విజ్ఞానవేత్త. విశాలదృష్టి గలవాఁడు. హిందువులపై వారి మతముపైఁ బ్రబలగౌరవము కలవాఁడు. అంతేకాక యాతఁడు చక్కని రాజనీతి నిపుణుఁడు. అందుచే జహాంగీరు నాతనితరువాత షాజహాను కూడ నీతనిని మిక్కిలి గౌరవముతోఁ జూచుచు నాతని యాలోచనలఁ గైకొని యాదరించుచు రాజ్యము చేసిరి. ఆసఫ్‌ఖాను జగన్నాథపండితుని యగాధమగు పాండిత్యము, అపారమగు ప్రతిభ, అనంతమగు సుగుణసంపదఁ గాంచి యాతనియం దత్యంతము స్నేహభావ

మునే చూపుచు వచ్చెను. ఇదియే జగన్నాథపండితుని యున్నతికి మూలకందమయ్యెను.

## జగన్నాథపండితుని కామరూపనివాసము

జహాంగీరు కుమారుఁడగు షాజహాను దక్కనువిజయ యాత్రకుఁ బంపినతరువాతఁ దనయారోగ్యము చెడిపోయినకారణమునఁ గాశ్మీరదేశమున కేఁగి యట వసింపఁజొచ్చెను. ఇంతలో ఢిల్లీనగరమున నంతఃకలహములు బయలుదేఱెను. ఢిల్లీసింహాసనమునకై షాజహానుపక్షమునఁ గొందఱును నూర్జహానుపక్షమునఁ గొందఱును జేరి పోరాడఁజొచ్చిరి. ఈవిధముగాఁ జక్రవర్తి లేకుండుటయు ఢిల్లీ పరిస్థితులు విషమించుచుండుటయుఁ గారణములుగా జగన్నాథపండితుఁడు భార్యను జంటబిడ్డ యగు తన పుత్త్రుని దీసికొని కామరూపదేశమునకుఁ దరలిపోయెను.

అప్పుడు కామరూపదేశమును బాలించుచున్న ప్రాణనారాయణుఁడు (క్రీ.శ.౧౬౩౩-౧౬౬౬) మిక్కిలి సమర్థుఁడు. రాజనీతినిపుణుఁడు. పండితపక్షపాతి. అతనిరాజ్య మపుడు చాలఁ బ్రఖ్యాతి గాంచియుండెను. అతఁడు జగన్నాథపండితునిఁ జాల గౌరవించి తనయాస్థానకవిసార్వభౌమునిగా నుంచుకొనెను. అతని మన్ననలకుఁ గృతజ్ఞతాపూర్వకముగా జగన్నాథపండితుఁ డాతనిపై 'ప్రాణాభరణ'మను కావ్యము వ్రాసి యాప్రభువునామము శాశ్వతముగా నుండున ట్లొనరించెను.

## మీవారుసంస్థానగౌరవము

జగన్నాథపండితుఁడు కామరూపమునఁ గొన్నిసంవత్సరములు ప్రశాంతముగా నివసించెను. ప్రాణనారాయణుఁడుమహా

వీరుఁ డగుటచే ఢిల్లీపాదుషా పాలనమును దృణీకరించి స్వతంత్రుఁడయ్యెను. అందుచే మహమ్మదీయు లాతనిపైఁ గత్తి కట్టి యాతని నెట్లైన బంధింపవలయు నని యెంచిరి కాని, చాలకాలము వారి యాస లడియాసలయ్యెను. దానికిఁ బ్రాణ నారాయణుని వీరత్వము నాతని సైన్యముల యుద్ధనైపుణ్యము కారణములు. ఇట్లు సుమారు పదిసంవత్సరములు స్వతంత్రుఁడై పరిపాలించి తుదకు వార్ధక్యమున ననారోగ్యము చేతను, రాజ్యమందలి ప్రజల యనైక్యము చేతను నాతఁడు మహమ్మదీయ ప్రభువులకు దాసోహ మనవలసి వచ్చెను.

ఈ పరిస్థితిలో జగన్నాథపండితుఁడు ప్రాణనారాయణుని సూచనపై సంసారముతో మీవారు రాజ్యమును జేరి యచటి ప్రభువగు జగత్సింహుఁడు సహృదయుఁడు పండితాభిమాని యని యాతనిఁ జేరెను. జగత్సింహుఁడు జగన్నాథపండితుని కీర్తిప్రతిష్ఠ లిదివఱకే వినియున్నవాఁడగుటచే నాతని నాదరించి తనయాస్థానవిద్వత్కవిగాఁ గైకొని గౌరవించెను. అందులకుఁ గృతజ్ఞుఁడై జగన్నాథపండితుఁడు "జగదాభరణ" మనునొక కావ్యము నాతనిపై వ్రాసి యాతని నామమును శాశ్వత మొనరించెను.

## పండితరాజబిరుదము

ఈ సమయముననే షాజహాను దక్కను విజయయాత్రను ముగించుకొని తండ్రి మరణమును, నూర్జహాను రాజ్యకాంక్షను నగరమందలి యంతఃకలహములను దెలిసికొని తనమిత్రుఁడు

మీవారు సంస్థానాధిపతియగు జగత్సింహునిసాయ మర్థించి ఢిల్లీసింహాసనమును దాను సంపాదింప నుద్యుక్తుఁడై మీవారు విచ్చేసెను. అప్పుడు జగన్నాథపండితుఁడు తన్ను గౌరవించిన జహాంగీరుకుమారుఁ డనియే కాక తన్నుఁ బ్రాణమిత్రునిగాఁ జూచుకొనుచుండిన షాజహానున కుపకృతియొనరింప ధర్మమని జగత్సింహునకుఁ దెలిపెను. జగత్సింహుఁడు షాజహానుసుగుణ సంపద నెఱిఁగినవాఁ డగుట నందుల కంగీకరించి మఱునాఁ డచట నే షాజహానునకు ఢిల్లీసామ్రాజ్యపట్టాభిషేకము నొనరించెను. ఆసమయముననే షాజహానుజగత్సింహులు జగన్నాథపండితుని ఢిల్లీసంస్థానవిద్వత్కవిరత్నము నొనరించి "పండిత రాయ"లను బిరుదము నాతని కొసఁగి దానితో సగౌరవముగా షాజహాను ఢిల్లీచక్రవర్తి యైనపిమ్మట సమ్మానింతు మని తీర్మానించిరి.

జగత్సింహుని సాహాయ్యసంపత్తి వలన ననతికాలము న కే షాజహాను విరోధివర్గము నుక్కడఁచి ఢిల్లీ పాదుషాయై మిక్కిలి విఖ్యాతి నార్జించెను.

## ఢిల్లీకిఁ బునరాగమనము

షాజహాను చక్రవర్తి యైనంత నే ప్రియమిత్రుఁడగు జగత్సింహుని నాతనితోపాటు సగౌరవముగా జగన్నాథపండితుని నాతని కుటుంబమును ఢిల్లీ తీసికొని వచ్చి వారికి మహా గౌరవములను జరపించెను. ఆమఱునాఁడే యొక బ్రహ్మాండ మగువిద్వత్సభఁజేసి యందు జగన్నాథపండితునకు "పండిత రాయ"లనుబిరుదమును స్వహస్తములతో సమర్పించి యాతని

నికిఁ దనకంటె నున్న తాసన మొసఁగి పూజించెను. ఇందులకు సభాసదులు, జగత్సింహుఁడు షాజహాను పొందిన యానందము నకు మేరయే లేకుండెను. ఈరీతి జగన్నాథుఁడు మహాగౌరవ మున మరల ఢిల్లీదర్బారులోఁ బ్రవేశించి వసింపఁజొచ్చెను.

షాజహానుచక్రవర్తి చాల రసజ్ఞుఁడు; సమస్తమతముల యందును గౌరవబుద్ధి కలవాఁడు. అందుచే నాతని సంస్థాన మున హిందూ మహమ్మదీయ కవిపండితులే కాక క్రైస్తవ మతస్థులు కూడ నుండెడివారు. కావున, షాజహానుచక్రవర్తి ప్రాపును గాంచి జగన్నాథపండితుఁడు రాజభోగముల ననుభ వించి యత్యంత మగు గౌరవము నందుకొనె ననుటలో నాశ్చర్యము లేదు.

## దారాషకో తోడి స్నేహము

షాజహానుచక్రవర్తి కుమారులలో దారాషకో యొకఁడు. ఆతఁడు సుగుణసంపదల కాలవాలమై శౌర్యగాంభీర్యాదుల కాటపట్టయి నిష్కళంకహృదయమునకు నిలయమై సర్వజన ప్రియుఁడు, విశేషించి హిందువులకుఁ బ్రియతముఁడు నై యొప్పారువాఁడు. ఆతనికి జగన్నాథపండితునియెడ గురు భావము. అందుచే నాతఁడు జగన్నాథపండితుని ప్రేరణము వలననే హిందూవిజ్ఞానము నెంతయో యలవఱచుకొనెను. ఆపిమ్మట నీతఁడే మన యుపనిషత్తులపైఁ గల మక్కువను విడువ లేక వానిని దన మాతృభాషయగు పార్శీలోని కనువ దింపఁజేసికొనఁ గోరి కాశీనుండి ప్రఖ్యాత పండితులను బ్రత్యేక ముగా రప్పించి యీ పని చేయించుకొనెను.

దారాషకో తాను యువరాజుగా నున్నప్పుడు, తన తండ్రియనంతరము సింహాసనము నధిష్ఠించినపుడు కూడఁ బండితరాయలపై మిక్కుటమగు మక్కువ చూపుచుండువాఁడు.

ఈ విధముగా నాంధ్రదేశమున జనించిన యొక పేద బాపఁడగు జగన్నాథపండితుఁడు కష్టించి బహుశాస్త్రముల నభ్యసించి వివిధప్రదేశములందు దిగ్దంతులగు పండితుల మన్నన లఁ గాంచి బహుసంస్థానములలో రాజగౌరవము లంది తుట్టతుదకు ఢిల్లీ పాదుషా కొలువుకూటమునఁ బండితరాయ బిరుదమును సంపాదించి యొప్పారుట గొప్పవిశేషము. ఒక్క జహాంగీరుచక్రవర్తిచేత నే కాక యాతని పుత్త్రుఁ డగు షాజ హానుచేతను, నాతని కుమారుఁ డగు దారాషకో చేతనుగూడ నితోధికముగ గౌరవము లంది మూఁడుతరముల ఢిల్లీశ్వరు లకుఁ బ్రధాన పండిత కవిశిరోమణియై సాటిలేని కీర్తి సంపా దించుట మఱియు విశేషము. అందుచేత నే,

"ఢిల్లీశ్వరో వా జగదీశ్వరో వా
మనోరథాన్ పూరయితుం సమర్థః..."

ఢిల్లీశ్వరుఁడు కాని జగదీశ్వరుఁడు కాని కోరికలు దీర్పసమర్థులు కాని యన్యులు కారని యీతఁను ఘోషించియుండెను.

## చరమదశ

జగన్నాథపండిత రాయ లిట్లు నిజప్రజ్ఞావిశేషమున ఢిల్లీ సార్వభౌమునివలన మహాగౌరవము లందుచుఁ జాలకాలము జీవించి యనేకములగునుత్తమగ్రంథములను సంస్కృతభాషలో

రచించియుండెను. అవి సారస్వతమున నొక మహోన్నత స్థానము సంపాదించి యీతనికీర్తి శాశ్వత మొనరించివైచినవి.

ఇట్లు కాలము కడచుచుండఁగా ఔరంగజేబు ఢిల్లీసింహాసనము నాక్రమింపఁ గుట్రలు పన్ని తన సోదరుఁడగు దారాషకోను నితర సోదరులను హత్య యొనరించి తన సంకల్పము తుదముట్టించుకొనెను. ఇట్లు రాజ్యమునకు వచ్చిన యౌరంగజేబు మహమ్మదీయ మతోన్మాదియు హిందూమత పరమద్వేషియు నగుట సంభవించెను. అందుచే నాతఁడు నాఁటికి సంస్థానమునఁ బెక్కుగౌరవము లందుచు హిందూమహమ్మదీయ సామరస్యమునకుఁ బాటుపడుచు విఖ్యాతులై యున్న హిందూపండితులను, గవులను, గాయకులను దొలఁగించి వారలను రాజధానీనగరమునుండి పాఱఁద్రోలించెను. ఈ బాధలకు గుఱియైన జగన్నాథపండితరాయలు ఢిల్లీనగరమును విడిచివేసి భార్యాపుత్త్రులతో మధురాపురమును జేరుకొనెను.

విద్యా వివేక వినయసంపన్నుఁడగు జగన్నాథపండితరాయలైహికసుఖముల నోలలాడి యిఁక నాముష్మికసుఖములకై తనకాల మంతయు నీశ్వరునిగుఱించిన యుగ్రమగు తపమునఁ గడపఁజొచ్చెను. ఆ కాలముననే యీతనికి భార్యావియోగము సంభవించెను. ఈతని పుత్త్రుఁడగు మాధవదీక్షితు డప్పటికే మహావిద్వాంసుఁడై "పండితరాజబిరుదమును" గడించి కాశికానగరమున కేఁగి యట నిత్యపండితగోష్ఠిలోఁ గాలము గడపుచుండెను. ఈతనికి జనించిన పుత్త్రుఁడే మహా

దేవసూరి యను పేరఁ బ్రఖ్యాత విద్వాంసుఁడై తన తాత వ్రాసిన భామినీవిలాసము మున్నగు గ్రంథములకుఁ జక్కని వ్యాఖ్యానములు వ్రాసి వన్నెగాంచెను.

## నిర్యాణము

ఇట్లు జగన్నాథపండితరాయలు పత్నీవియోగము నంది, విద్యావినయము లందిన పుత్రపౌత్రులనుగుఱించి తనకేమియు విచారము లేకపోఁగా నిఁక విశ్వేశ్వర దైవసాన్నిధ్యమునఁ దన యంత్యజీవితమును గడప నిశ్చయించుకొని కాశీనగరమున కేఁగి యచట నిరంతరధ్యానతపోనిమగ్నుఁడై, భక్తి జ్ఞాన విరాగసంపన్నుఁడై క్రీ. శ. ౧౬౬౫ ప్రాంతమునఁ గాశీకా విశ్వేశ్వరుని యందు లీనమై పోయెను.

## పండితరాయల గ్రంథరత్నములు

పండితరాయలు భారతీయసారస్వతమునకుఁ జేసినసేవ నిరుపమానము. సంస్కృతసరస్వతి కాతఁడు తొడిగిన నగలు చేసిన పూజలు నాతనికి శాశ్వతకీర్తి ఘటింపఁజేసినవి. ఆతఁడు కాళిదాసాదుల యంతటి మహాకవి కాకపోవచ్చును. అంత మాత్రమున నాతని కవితాశక్తికి లోపము లేదు. ఆతఁడు మహాపండితుఁడుగా, మహోత్తమ విమర్శకుఁడుగా సాటిలేని కీర్తి గడించిన మాట నిక్కువము. కవితాకళయందు సైత మాతఁ డాధునిక భారతీయ సాహిత్యయుగమునఁ బ్రథమ స్థాన మందఁదగినవాఁ డనుట సత్యము.

ఈతఁడు రచించిన సుధాలహరి, అమృతలహరి, లక్ష్మీలహరి, కరుణాలహరి, గంగాలహరి యను నైదు కావ్యములు పంచలహరు లనుపేరఁ బ్రసిద్ధిగన్నవి. ఇందు భావానుభూతి యెల్లెడల వెల్లివిరియుచుండును. అంతేకాదు. జగన్నాథ పండితరాయల కవిత్వ మందుఁ బరమావధిఁ గన్న దనుటయు సత్యమే. ప్రకృతి వర్ణనమున నీతఁడు చూపిన కళానైపుణ్యము, ఊహాశక్తి నిరుపమానములు.

## సు ధా ల హ రి

సుధాలహరి యనునది ముప్పది శ్లోకములలో నున్న యొక ముక్తకకావ్యము. ఇందలి వృత్తములు స్రగ్ధరావృత్తములు. ఇందు జగన్నాథుఁడు సూర్యదేవుని బహుముఖముల స్తుతించి యున్నాఁడు. ఇందు సూర్యోదయమును వర్ణించుపట్టు మొట్టమొదటి శ్లోకము. తరువాతి పంద్రెండు శ్లోకములలో సూర్యదేవుని స్తవమున్నది. మూఁడు శ్లోకములు సూర్యకిరణములను గూర్చి చేసిన ప్రశంసలు.

ఇందలి సార మిది: సూర్యుఁడు పద్మములకు నెచ్చెలి; కలువలకు విరోధి; కలువలు పూర్తిగ నాశనము కాకుండఁ జంద్రుఁడు రక్షించినాఁడు. చీకటిమూఁకలను ద్రోలివైచి జగమున కంతకును బ్రకాశ మొసఁగిన రక్షకుఁడు సూర్యుఁడు; ఆతఁడు సర్వరోగములను బోఁగొట్టఁగలఁడు; సర్వపాపములను నశింపఁ జేయఁగలఁడు; సర్వమును బవిత్రము చేయఁగల శక్తియుక్తుఁడు. భక్తులకుఁ గల్పవృక్షమై, సర్వాంతర్యామియై,

పద్మములందలి లక్ష్మిని బూజించుచు జగదాభరణమై యొప్పు చుండును. సంధ్యాసమయముల నీతనిని సర్వప్రజలును బూజింతురు. ఈతఁడే కాలస్వరూపుఁడు. అస్తమయకాలమునఁ బశ్చిమ సముద్రములో నీతఁడు విశ్రాంతిఁ గైకొనును. ఆయు రారోగ్య జవజీవముల నొసఁగి ప్రజలను రక్షించెడు మహా దైవ మీతఁడే. చంద్రునకు ధ్రువాదినక్షత్రములకుఁ గాంతి నిచ్చు పరమాత్ముఁ డీతఁడే. ఈతఁడు నిత్యము మనలను రక్షించుఁగాక!

ఇందలి శైలి కొక్క శ్లోక ముదాహరింతును :

"శ్లో. త్రాతామీవార్తలతాః ప్రతిదినవిహితానేకగీర్వాణరతాః. భక్తానాం కల్పవృతాః స్ఫురదనలగత స్వర్ణ భాసాం సదృతాః." 'సానో భానోః ప్రభానో నయనసరణితో దూరతో జాతుయాతు'

ఇందు మొదటిదానిలోఁ దుదిపదము మరల మరల వచ్చును. రెండవదానిలో రెండవయక్షరము మరల మరల వచ్చును. ఇట్టి విశేషము లెన్నియో యిందుఁ గాననగును.

## అమృతలహరి

'అమృతలహరి' యమునానది వర్ణనము. ఇందు శార్దూల విక్రీడిత మను పేరుగల వృత్తములు పదియున్నవి. ప్రతి పద్యము తుదను గవిసి గూర్చిన పద్యభాగము మకుటముగా నున్నది :

"అయం పండితరాజేన
శ్రీజగన్నాథ శర్మణా,
స్తవః కళిందనందిన్యా
నిర్మలో నిరమీయత."

ఇందలిసార మిది : కాళిందీనది నీలరత్నములతోఁ బొదుగఁ బడినట్లు నల్లనికాంతిగల నీళ్ళతో నుండును. ఆ నీల వర్ణము కానవచ్చుటవలన శ్రీకృష్ణుని నీలమేఘచ్ఛాయ గుర్తునకు వచ్చును. అడుగున రత్నములను గలిగి శివునిఛాయను, పైని నల్లరంగుగల నీరు కలిగి శ్రీకృష్ణుని, స్మరింపఁజేసి హరి హరుల యేకరూపము నీ నది స్ఫురింపఁజేయును. ఇందలినీరు మహాపాపపంకమును గడిగివేయును. అంతేకాదు. ఈ నదీ జలము వేళాకోళమునకైనను 'కాళింది' యని యుచ్చరించిన వారికిని నన్నిగోరికలు దీర్పఁగల శక్తిగలది. యమునానది యమృతప్రవాహమున నోలలాడు భక్తాగ్రణు లెంతధన్యులో కదా! మచ్చునకు మొకటిశ్లోకము :

"పాయం పాయ మపాయహారి జనని! స్వాదు త్వదీయం పయో
నాయంనాయ మనాయనీమకృతినో మూర్తిం దృశోః కైశవీం
స్మారం స్మార మపారపుణ్యవిభవం కృష్ణేతివర్ణద్వయం
చారం చార మితస్తవతటే ముక్తో భవేయం సదా."

ఈతని కృష్ణభక్తి చాల గొప్పది : కృష్ణుఁ డనఁగా నీత నికి ముక్తిద్వారము.

"ద్వారం నిర్వృతిసద్మనో విజయతే కృష్ణేతి వర్ణ ద్వయమ్"అని యీతని వాక్యము.

## గంగాలహరి

దీనినే పీయూషలహరి యనియు నందురు. ఇది పంచల హరులలోను దొలుదొలుతటిస్థాన మాక్రమించినది. ఇది గంగా దేవిని గుఱించి చేసిన యుత్తమస్తోత్రము. గంగానది సమస్త

పాపములను బోఁగొట్టునదిగా నరులకు సమస్తైశ్వర్యములు నిచ్చునట్టిదిగా నిందు వర్ణితము.

## లక్ష్మీలహరి

ఇది లక్ష్మీదేవిని గుఱించి నలుబదియొక్క శ్లోకములు గల పద్యకావ్యము. ఇందు లక్ష్మీదేవిరూపము నాపాదమస్తకమును గవి వర్ణించియున్నాఁడు. మొదటి యైదుశ్లోకములలోను లక్ష్మీకటాక్షమును, మిగిలినశ్లోకములలో నామె సర్వాంగ సౌందర్యమును గవి చక్కని శైలిలో వర్ణించెను.

## కరుణాలహరి

జగన్నాథపండితుని పంచలహరులలో నిది యుత్తమ శ్రేణికిఁ జెందినది. దీనికే విష్ణులహరి యనియుఁ బేరు. ఇందు నలువదిమూఁడు మృదుమధురశ్లోకములలో విష్ణుమూర్తి గొప్పతనమును నాతని దయాఫలితములను నీతఁడు వర్ణించినాఁడు. తన్ను రక్షింపు మని చేసిన యీస్తుతిలో నీతని భక్తి భరిత హృదయమును స్పష్టముగాఁ గాననగును.

"న ధనం న చ రాజ్య సంపదం
న హి విద్యామిద మేక మర్థయే
మయి ధేహి మనాగపి ప్రభో!
కరుణాభంగి తరంగితాం దృశమ్."
"అయ మత్యధమోపి నిర్గుణో
దయనీయో భవతా దయానిధే!
వమతాం ఫణినాం విషానలం
కిము నానందయితా హి చందనః?"

## జ గ దా భ ర ణ ము

ఇది జగత్సింహ మహారాజునుగుఱించి చేసిన యశోవర్ణనము కాని, యిందొక శ్లోకము జహంగీరునుగుఱించియు మఱి యొకటి దారాషకోనుగుఱించియు నుండుటచే నిది దారాషకోనుగూర్చి పండితరాయలు చేసినయశోవర్ణన మని కొందఱందురు.

## ప్రా ణా భ ర ణ ము

ఇది యేఁబదిమూఁడుశ్లోకములలో నున్నది. ఇది కామరూపేశ్వరుఁడగు ప్రాణాభరణుని కీర్తి వర్ణనము. ఇందు మొదటి రెండుశ్లోకములలో ప్రాణనారాయణుని యుత్తమత్వమును, గవి తన కుత్తమనాయకుఁడు లభించినందులకుఁ బొందిన యానందమును వర్ణించినాడు. నిజముగా మహావీరుఁడైన ప్రాణనారాయణు నిందు జగన్నాథపండితుఁడు చాలఁ జక్కగా నభి వర్ణించియున్నాఁడు.

## ఆ స ఫ్ వి లా స ము

ఇది జగన్నాథపండితరాయల యున్నతికిఁ గారకుఁడై యాతని నెచ్చెలికాఁడైన ఆసఫ్ఖాను మరణించిన పిమ్మటఁ గృతజ్ఞతాసూచకముగాఁ బండితరాయలు రచించిన చిన్న కావ్యము. ఆసఫ్ఖాను సుగుణములు, ఆతఁడు పండితరాయలునకుఁ జేకూర్చిన సుఖసంపదలు నిందభివర్ణింపఁబడినవి.

## భా మి నీ వి లా స ము

ఇది జగన్నాథపండితుని యుద్గ్రంథములలో నొకటి. అన్యోక్తి లేక ప్రాస్తావికము, శృంగారము, కరుణము,

శాంతము నను నాలుగు విభాగములుగా నీ కావ్య మున్నది. ఇందలి భాగములకు సముల్లాసము లని కవి పేరిడినాఁడు.

అన్యోక్తిసముల్లాసములో నూఱుపైఁగా శ్లోకము లున్నవి. వీని కన్యోక్తు లని పేరు. అన్యోక్తి యనఁగా నొక సంబంధ ములేని విషయమునుగూర్చి చెప్పఁగా నది యొక సంబంధముగల దానిని సూచించుచుండును. ఉదాహరణమునకుఁ జెఱకుచెట్టొ కటెన్నియో బాధలుపడి పెరిఁగి యితరులకే తియ్యఁదనము నిచ్చి సంతోషింపఁజేయునుగదా! యనఁగా దీనివలన నుత్త ముఁ డెన్నఁడు నొరులకొఱకే జీవించును కాని తన స్వార్థమును జూచుకొనఁ డన్నది ధ్వనించును. ఇది యన్యోక్తి.

శృంగారసముల్లాసములో వివిధశృంగార ఘట్టములను వివరించుచు నూఱునకు మించిన శ్లోకములు గలవు.

కరుణసముల్లాసములోఁ బందొమ్మిదిశ్లోకములు భామి నినిగూర్చి సంతాపరూపమున నున్నవి. భామిని యనఁగాఁ బండితరాయల భార్య యగు కామేశ్వరి యనియే పెక్కు రభిప్రాయపడిరి.

శాంతసముల్లాసములో జగన్నాథపండితుని వైరాగ్య సంపత్తి, ప్రపంచవిషయములపై నసహ్యాత ప్రస్ఫుటముగాఁ గాననగును. మొత్తముపై నీ కావ్య మెన్ని విధములనో మిన్నగా నెన్నఁబడుచున్నది.

## రసగంగాధరము

రసగంగాధర మొక యలంకారగ్రంథము. ఇట్టి లక్షణ గ్రంథము లన్నిటిలో జగన్నాథపండితుని యీ రసగంగాధర

ముత్తమోత్తమ మైనది. భరతుని 'నాట్యశాస్త్ర' మిట్టి గ్రంథములోఁ దొలుతటిది. రసగంగాధరము చిట్టచివరిది. ధ్వనియే కావ్యమునకుఁ బ్రధాన మనువాదమునకు మిక్కిలి బలము చేకూర్చిన పండితుఁడు పండితరాయలే. కావ్య మన నేమి? దాని లక్షణము లేవి? అది యెట్లుండవలయును? ఎట్లుండరాదు? మున్నగు సర్వవిషయములు పండితరాయ లీగ్రంథమునఁ దెలిపి యాయాతావుల నుదాహరణముగాఁ దానువ్రాసిన శ్లోకములనే చూపియున్నాఁడు. ఇందలి ప్రకరణ ములకు "ఆననము" లని పేరు. ఇందుఁ గలవి యైదు ప్రకరణ ములు. శివుఁ డైదు ముఖములు కలవాఁ డని ప్రసిద్ధి యగుటను "రసగంగాధర" మను గ్రంథనామము సార్థక పఱచుట కింకై దానములే యాతఁ డుంచినాఁడు.

రస మన్నది యొక మహాసముద్రము. అందుఁ బండిత రాయలను నావికుఁడు కడునిపుణతతో విస్పష్టములగు మార్గ ములనుండి తన గ్రంథ మను పడవను నడపి కావ్యతత్త్వమును చక్కఁగా నిర్దేశించు టనెడు తీరమును జాగ్రత్తగాఁ జేరగలిగి నాఁడు. తానొక మందరపర్వతమునని రసమను పాలసము ద్రమును బహుశ్రమలకోర్చి చిలికి యమృతము నెల్లరకుఁ జూఱ యిచ్చుచున్నానని యాతఁడు చెప్పుకొనెను.

ఇం దీతఁడు కావ్యము ' రమణీయార్థప్రతిపాదక మగు శబ్ద' మని నిర్వచించినాఁడు. దీని కీతఁడు పూర్వులయభిప్రాయ ముల నెన్నిటినో కైకొని విమర్శించి తన వాదమును యుక్తి

యుక్తముగా నిలఁబెట్టుకొనెను. 'ప్రతిభ'యే కవి కుండవలసిన ప్రధానలక్షణ మని యీతఁడు పేర్కొన్నవాద మెల్లర మెప్పులను గాంచఁగన్నది. ఉత్తమోత్తమము, ఉత్తమము, మధ్యమము, అధమము నని కావ్యమును నలుదెఱఁగుల నీతఁడు విభజించి తన స్వతంత్రబుద్ధిని ప్రకాశింపఁజేసెను. ఇం దీతఁడు సర్వాలంకారములను స్పష్టముగాఁ దెలిపి వానివానికిఁ జక్కని యుదాహరణ శ్లోకములను రచించి చూపెను. వేయేల, ఇందు లేని రసాలంకారాది విషయములు లేనే లేవు.

అందుచే రసగంగాధరము భారతీయ సాహిత్య చరిత్రముననే కాక ప్రపంచ సారస్వత చరిత్రమునను నగ్రస్థానమందఁ దగిన యుత్తమోత్తమ గ్రంథము.

## ఇతర గ్రంథములు

పండితరాయల వ్యాకరణపాండిత్యమునకు గీటుఱాయి యనఁదగు నొక గ్రంథములో భట్టోజీ దీక్షితుఁ డను మహా పండితుఁడు రచించిన "ప్రౌఢమనోరమ" "శబ్దకౌస్తుభము" అను వ్యాకరణ గ్రంథములపై నీతఁడు చేసిన సునిశిత విమర్శనము కలదు. ఈ పుస్తకమునందలి విషయము మహా పండితులకే యచ్చెరువు గొలుపుచున్నది. ఈ గ్రంథముననే పండితరాయలకు "పదవాక్య ప్రమాణ పారావారీణ" యను బిరుద మున్నట్లు పేర్కొనఁబడినది. ఇది యాతని పాండిత్యమునకు నిజముగాఁ దగియే యున్నది.

ఇవి కాక యీతఁడు 'చిత్ర మీమాంసాఖండనము' 'యమునా వర్ణనచంపువు' అను గ్రంథములను వ్రాసియుండెను.

## సింహావలోకనము

జగన్నాథ పండితరాయల జీవితగాథలు నాతని పాం డిత్య విశేషములు నింతవఱకు సంక్షేపముగనే చూచితిమి. ఈతని జీవితమువలన మనము నేర్చుకొనవలసిన నీతులు పెక్కు గలవు. దేశమునకు మాఱుమూలఁ గల కోనసీమలో నొక దరిద్రబ్రాహ్మణు నింటఁ బుట్టి బాల్యమునుండియు ననేక కష్టముల నెదుర్కొని తండ్రిశిక్షణవలనను, గురువుల సేవవలనను మహాపండితుఁడై, పండితుఁడే కాక మహాకవియై, యంతమాత్రమే కాక మహావిమర్శకుఁడై బహుసంస్థానములలో గొప్ప గౌరవములంది ఢిల్లీపాదుషా కొలువుకూటమున మూఁడు తరములపాటు ప్రధానవిద్వత్కవిరత్నస్థానము నంది యనేక సద్గ్రంథములు వ్రాసి తుదకుఁ గాశీవిశ్వేశ్వరుని పాదసన్నిధిని సాయుజ్య మందిన ధన్యజీవి జగన్నాథ పండితరాయలు.

ఈతనికిఁ గల కష్టసహిష్ణుత, విద్యాభిరుచి, సాహస సంపద, కార్యశూరత, లౌకికనిపుణత, భక్తిపరత, ఉత్తమ దీక్ష, యివియే యీతనిని మహావ్యక్తిని జేసి వెలిచినవి. ఈతని వివేకబుద్ధి, సమరసస్వభావము, ఆంతరభక్తితత్త్వము, నెల్లరకు నాదర్శప్రాయములు. ఇతఁడు హిందువై, యందును సనాతన హిందూమతతత్త్వజ్ఞుఁడై యుండియు మహమ్మదీయులకు నారాధనీయుఁడగుట, వారితలలో నాలుకవలె మెలఁగి వారిచే వారి పాదుషాలచే బహుగౌరవము లందుట చాల గొప్ప విషయము. ఇంతటి జగన్నాథపండితరాయలు మన యాంధ్రుఁడగుట మన మహాభాగ్యము. అతని సుగుణముల నలవఱచుకొని మనము నంతటికీర్తి సంపదను జూఱకొందుముగాక!

"పరస్పర సమాస్వాద
ప్రథమానస తత్త్వయోః
కవితా బుధయోర్యోగం
నమామి శివయోర్యథా."

"పండితరాయ కీర్తియుఁ బ్ర
భావము నెన్నఁగ సాధ్యమానె! యు
ద్దండకవిత్వ చాతురియుఁ
దార్కిక దృష్టియు సద్వివేక మా
ర్తాండతయుఁ సధర్మరతి
రాజసభాజన రంజకత్వముఁ
దండితనంబు రూపమును
దాల్చిన పండితుఁ డాతఁ డెన్నఁగన్.
కొండాడి రఖిల హైందవ
పండితులున్ మొగలుంజాతి ప్రభువులు తురుష్కుల్
నిండు మనంబులఁ దమ మి
త్రుం డని యతఁ డౌను సుగుణతోయధి తలఁపన్."